Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 32 • 6-8-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## జానారెడ్డి అందలానికి నెల్లూరీయుడి ప్రయత్నం!

రాజకీయాలలో బంధాలు, సంబంధాలు ఎట్లా ఏర్పడతాయో వ్యూహకే అందదు. సముద్రంలో ఉప్పుకు, చెట్టుమీది కాయకు బంధం పెనవేసుకొన్నట్లుంటాయి. తెలంగాణ నాయకుడు జానారెడ్డిని అందలం ఎక్కించడానికి ఒక నెల్లూరీయుడి పలుకుబడి ప్రయోగం జరుగుతుందంటే నమ్మగలమా? కానీ అది నిజమే అని ఢిల్లీ వార్తలు చెప్తున్నాయి.

వెనుకటి రోజులలో నెల్లూరుజిల్లా రాజకీయాలను తన కొనగోటితో తిప్పిన రాజకీయ మేధావి స్వర్గీయ మేనకూరు గోపాలకృష్ణారెడ్డి తనయుడు సుకుమార్‌రెడ్డి ఈ పనిలోనే వున్నాడని వర్తమానం. సుకుమార్ అపర కుబేరుడు. రియల్ ఎస్టేట్ వ్యాపారంలో బంగారు పంటలు పండించినవాడు. ఆయనకు జానారెడ్డికి దగ్గర చుట్టరికం. కాంగ్రెస్ జాతీయ రాజకీయాలలో తిరుగులేని శక్తిగా ఎదిగిన అహ్మద్‌పటేల్‌తో వ్యాపార సంబంధం. ఈ రెండింటినీ మేళవించి, జానారెడ్డిని అందలం ఎక్కించాలని సుకుమార్ ప్రయత్నిస్తున్నట్లు చెప్తున్నారు. ఏ

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్

సీఎం పై విమర్శలతో

జగన్‌వర్గం

జగన్

నందు

'ఓదార్పు యాత్ర' ముగిసిందని 'దండయాత్ర' మొదలెట్టారా సార్!?

### ఉపఎన్నికల ముప్పు

# సొమ్ము మనదైనా సోకు అతగాడిదే!

తెలంగాణ ఉపఎన్నికల ఫలితాలు అటు కాంగ్రెస్ ఇటు తెలుగుదేశం నేతల జవసత్వాలను హరించి వేశాయి. ఎవరి వ్యూహకు, ఎవరి అంచనాకు అందని ఫలితాలివి. ఓటమి తప్పదని భావించారే తప్ప, ప్రజా తీర్పు ఇంత కఠినంగా, ఇంత క్రూరంగా, ఇంత స్పష్టంగా, ఇంత అవమానకరంగా ఉంటుందని ఎవరూ కల కూడా కనలేదు. రెండు ప్రధాన పార్టీలూ డిపాజిట్లు కూడా దక్కించుకోలేని దీన స్థితికి దిగజార్చేశాయి ఈ ఎన్నికలు. ఓటు బ్యాంకు సిద్ధాంతాలన్నీ గాలిలో కలిసిపోయాయి. స్థానిక నాయకత్వాలు, అభ్యర్థుల బలాబలాల వంటి లెక్కలన్నీ దుమ్ము కొట్టుకపోయాయి. డబ్బు కట్టలు, మందు సీసాలు, బిర్యానీ పొట్లాల ప్రలోభాలు కనీసపాటి ప్రభావం కూడా చూపలేదు. అర్జునుడి బాణం గురికి చెట్టు మీద ఉన్న పిట్ట కన్ను మాత్రమే కన్పించినట్లు ఓటర్లకు తెలంగాణ రాష్ట్ర లక్ష్యమొక్కటే మనసుకెక్కింది. అది తప్ప మరే అంశాన్నీ వారు పరిగణనలోకి తీసుకోలేదు. తమ చేతిలోని ఓటు కాగితాన్ని తెలంగాణ సాధనకు గురిపెట్టిన అస్త్రంగా భావించారు. తమ తీర్పును విస్పష్టంగా, కుండబద్ధలు కొట్టినట్లు ప్రకటించారు. ఆ దెబ్బకు అన్ని రాజకీయ పార్టీల దిమ్మ తిరిగిపోయింది. నవనాడులూ కృంగిపోయాయి. శక్తులన్నీ చచ్చుబడిపోయాయి. యుక్తులన్నీ చతికిలబడ్డాయి.

నిజానికి ఈ ఎన్నికలలో తెలంగాణ గురించి మాట్లాడని పార్టీ లేదు. అన్ని పార్టీలూ తెలంగాణ ఇస్తామని, తెస్తామని భీషణ ప్రతిజ్ఞలు చేశాయి. అందరు అభ్యర్థులు తాము తెలంగాణ కోసమే పుట్టామని, దాని సాధనలోనే చస్తామని శపథం పూనారు. కానీ ఓటర్లు టిఆర్ఎస్‌ను మాత్రమే తెలంగాణకు సంకేతంగా భావించారు. కెసిఆర్ ఒక్కడిని ఉద్యమ రూపంగా ఆరాధించారు. ఎన్నికల ఓటమి కంటే ఈ ప్రజాభిప్రాయం కాంగ్రెస్, టిడిపిలను కలవర పెడుతున్నాయి. తెలంగాణ రాష్ట్రం అంటూ ఏర్పడాలంటే, ఇప్పటికిప్పుడు కాంగ్రెస్ పార్టీ వల్లనే సాధ్యం. కేంద్ర, రాష్ట్రాలు రెండింటిలో అధికారంలో వున్న పార్టీ అదొక్కటే. శాసనసభలో అయినా, లోక్‌సభలో అయినా తీర్మానం ప్రవేశపెట్టవలసింది వారే. ఆమోదించవలసిందీ వారే. కానీ తెలంగాణను ఎవరు ఇచ్చినా, ఎవరు తెచ్చినా కీర్తి మాత్రం టిఆర్ఎస్‌కు, కెసిఆర్‌కు దక్కబోతున్నదని ఈ ఉపఎన్నికల ఫలితాలు రుజువు చేశాయి. తెలంగాణ ఇస్తే, కెసిఆర్ తెలంగాణ జాతిపితగా ఎదిగిపోతాడు. కాంగ్రెస్‌కు వచ్చే లాభం అంటూ ఏదీ లేదు. ఒకవేళ తెలంగాణ రాకుండా అడ్డుకొంటే కాంగ్రెస్‌ను ప్రజలు సమాధి చేస్తారు. ఎటు చూసినా లాభం కెసిఆర్‌ది, నష్టం కాంగ్రెస్, టిడిపిలది.

సొమ్ము మనదైనా సోకు అతగాడు కొట్టుకపోతాడన్న నిజాన్ని జీర్ణించుకోలేక పోతున్నారు కాంగ్రెస్ నేతలు. ఉపఎన్నికలలో పోటీ చేయకుండా వుండి వుంటే ఈ ప్రమాదం తప్పేది. టిఆర్ఎస్ అభ్యర్థులను ఏకగ్రీవంగా ఎన్నికచేసి వుంటే, ప్రజల మనోభావాలు ఎప్పటికీ అర్థమయ్యేవి కావు. 2009 ఎన్నికల ఫలితాలే రాజకీయ వాద ప్రతివాదనలకు ప్రాతిపదికగా వుండేవి. ఎన్నికలలో పోటీ చేసి తమ గొయ్యి తామే త్రవ్వుకొన్నాయి రెండు ప్రధాన రాజకీయ పార్టీలు. ఈ గోతిలో నుంచి బయటపడడం ఎట్లో ఎవరికీ అర్థం కావడం లేదు. కెసిఆర్ జోరును నిలువరించే మార్గం కన్పించడం లేదు. తాము కూడా తెలంగాణ అనుకూలురమేనని ప్రజలను నమ్మించడం ఎట్లా అన్నది ఇప్పుడు వీరిని వేధిస్తున్న ప్రశ్న. కానీ అటు సోనియాగాంధీ, ఇటు చంద్రబాబు తెలంగాణ రాజకీయవాదుల మనోభావాలను అర్థం చేసుకొని అందుకు అనుగుణంగా నిర్ణయాలు తీసుకొనే పరిస్థితి కన్పించడం లేదు. వారిది విశాల దృష్టి. పార్టీ అధినేతలుగా అది తప్పదు. కానీ తెలంగాణ పట్ల ఇప్పటికైనా దాగుడు మూతలు ఆపకుంటే ఈ రెండు పార్టీలకు పుట్టగతులు వుండవన్నది నిజం. అందుకు తమ అధినాయకత్వాలను ఒప్పించడంలోనే తెలంగాణ వాదుల రాజకీయ భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. తెలంగాణ తెలుగుదేశం నేతలందరూ కట్టగట్టి, ఒక గుంపుగా చంద్రబాబు వద్దకు వెళ్లి ఈ వాదనను మొరపెట్టుకొంటే ఆయన ఇక్కడెగిరి అక్కడ పడ్డారు. తెలంగాణ కావాలని నేనెట్లా కోరుతానని గద్దించాడు. ఆయన కోపం చూసి అందరి ముఖాలూ చిన్నబోయాయి. చంద్రబాబు ఇదే ధోరణి ప్రదర్శిస్తే రేపటి నుంచి తెలంగాణ గ్రామాలలో తాము పెళ్లిళ్లకి, చావులకు కూడా వెళ్లలేని పరిస్థితి వస్తుందని గోడు గోడు మంటున్నారు నేతలందరూ.

కాంగ్రెస్ మంత్రులు ఇంకా గందరగో

కొరవ 14వ పేజీలో

## రోశయ్యపై గుర్రు

నిజామాబాద్‌లో తన ఓటమికి ముఖ్యమంత్రి రోశయ్య పరోక్షంగా ప్రయత్నం చేశాడని ఆవేదన చెందుతున్నాడు పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్. ఈ ఘోర ఓటమి పరాభవం ఆయనకు పిచ్చెక్కిస్తున్నది. ఏళ్లతరబడి కష్టపడి నిర్మించుకొన్న రాజకీయ సౌధం ఒక్కరోజులో పేక మేడ వలె కూలిపోయిందన్న చింతలో వున్నాడు డిఎస్. ఎన్నికలలో పోటీ చేయాలన్న నిర్ణయం ఆత్మహత్యా సదృశ్యంగా మారడంతో విలవిలలాడి పోతున్నాడు.

ఆయన పోటీ చేసిన నియోజకవర్గంలో 12వేల మంది వరకు వైశ్య ఓటర్లున్నారట. రాష్ట్రస్థాయి ఆర్యవైశ్య సంఘమొకటి ఈ ఎన్నికలలో కాంగ్రెస్‌కు ఓటు చేయవద్దని విజ్ఞప్తి చేస్తూ ఒక కరపత్రం విడుదల చేసిందట. ముఖ్యమంత్రి రోశయ్యకు తెలియకుండా వైశ్యులు ఇటువంటి

కొరవ 14వ పేజీలో

# మద్యాంధ్రప్రదేశ్

రాష్ట్రంలో మద్యం అమ్మకాలను మరింత పెంచడానికి నానా తంటాలు పడుతున్నది రోశయ్య సర్కారు. అందులో ఒక భాగమే కొత్త బార్ల ఏర్పాటుకు అనుమతి. పట్టణాలలో అయితే ప్రతి 30వేల మందికి ఒకటి, నగరాలలో అయితే ప్రతి 12వేల మందికి ఒకటి లెక్కన కొత్త బార్లను అనుమతిం చాలన్నది ప్రభుత్వ పథకం. అంటే ఒక్క హైదరాబాద్ నగ రంలో ఐదు వందల బార్ల వరకు తెరుస్తారన్న మాట. ఇప్పటికే రాష్ట్రంలో 8వేలకు పైగా బ్రాందీ షాపులున్నాయి. వాటికి అను బంధంగా దాదాపు లక్ష బెల్ట్ షాపులు నడుస్తున్నాయి. బెల్ట్ షాపు లేని గ్రామం రాష్ట్రంలో మొత్తం మీద లేదు. వెయ్యి, పదిహేనువందల జనాభా కూడా లేని మారుమూల కుగ్రామా లలో సైతం బెల్ట్ షాపులున్నాయి. ఇవి చాలక కొత్తగా మరిన్ని బార్లు తెరవాలనుకొంటున్నది రాష్ట్ర ప్రభుత్వం.

బ్రాందీ షాపులో నియమం ప్రకారం సీసాలు మాత్రమే అమ్మాలి. విడిగా గ్లాసులో పోసి మద్యం అమ్మకూడదు. బారులో సీసాలు విప్పి ఎవరికి ఎంత కావాలో అంత మోతాదులో మందు పోయవచ్చు. బ్రాందీ షాపు వద్ద త్రాగకూడదు. సీసా కొనుక్కొని వెళ్లిపోవాలి. బారులో అయితే కూర్చుని త్రాగవచ్చు. రెండింటి మధ్య వున్న ఈ స్వల్ప తేడాను కుంటిసాకుగా చూపించి మరిన్ని బ్రాందీ అమ్మకం కేంద్రాలను తెరవాలన్నది ప్రభుత్వ కుత్సితం. నిజానికి ఏ బ్రాందీ షాపు కూడా ఈ నియమాన్ని పాటించడం లేదు. ప్రతి అంగడికీ అనుబంధంగా ఒక గది తీసుకొని, దాన్నే అనధికార బారుగా మార్చి, అక్కడే త్రాగే వసతి కల్పిస్తున్నారు యజమా నులు. దాదాపుగా అన్ని బ్రాందీ షాపులూ బార్లవలెనే నడు స్తున్నాయి. ఆ నిజం ప్రభుత్వానికి తెలుసు. కానీ తెలియనట్లే నటించి, కొత్త బార్ల అనుమతి జిఓ జారీ చేసింది. మద్యం అమ్మకాల ద్వారా వచ్చే రాబడి మీద ప్రభుత్వానికి మమకారం ఎంతగా పెరిగిపోతున్నదీ దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. ప్రభుత్వ రాబడిలో మూడవ వంతు మద్యం ద్వారానే వస్తు న్నది. షాపుల వేలంలో 7వేల కోట్లు వచ్చాయి. బ్రాందీ సీసాల టోకు వర్తకం మొత్తం ప్రభుత్వానిదే కాబట్టి, ఆ కమీ షన్ దాదాపుగా నాలుగైదు వేల కోట్ల వరకు వస్తున్నది. దీనికి అదనంగా ప్రతి సీసా మీద అమ్మకం పన్ను రూపంలో మరొక 10వేల కోట్లకు మించి దండుకొంటున్నారు. అయినా తమకం తీరడం లేదు. ఈ రాబడిలో అధిక భాగం కూటికి గతిలేని నిరుపేద కుటుంబాల నుంచే వస్తున్నదన్నది నిజం. గ్రామీణ ఉపాధి పథకం క్రింద ఈ ఏడాది రాష్ట్రంలోని పేదలకు 6వేల కోట్ల రూపాయలు కూలీ రూపంలో చెల్లించింది కేంద్ర ప్రభు త్వం. దాదాపుగా ఆ మొత్తం బ్రాందీ షాపుల ద్వారా ప్రభుత్వ ఖజానాకు చేరిపోయిందని అంచనా. మద్యం వ్యసనంతో పేదల కుటుంబ జీవనం ఛిద్రమై పోతున్నది.

మద్య నిషేధం వీలుకాని పని అనడంలో సందేహం లేదు. నిషేధం విధిస్తే మాఫియా ముఠాలు, కల్తీ సారా అమ్మ కాలు పెరుగుతాయే తప్ప త్రాగుడు వ్యసనం తగ్గదు. అందువల్ల మద్య నిషేధం పాటించడం లేదని ప్రభుత్వాన్ని నిందించలేము. అయితే త్రాగుడుకు బానిసలైన వారి కోసం మాత్రమే మద్య వ్యాపారం నడవాలి తప్ప, ప్రజలందరూ త్రాగి తూలేట్లు చేయడం ప్రభుత్వానికి ధర్మం కాదు. నియమిత వేళల్లో మాత్రమే షాపులు తెరిచి ఉంచడం, అనుమతించిన షాపులలో తప్ప వేరెక్కడా అమ్మకాలు, బెల్ట్ షాపులు లేకుండా నియంత్రించడం, అంగళ్ల వద్ద నిలబడి త్రాగే పద్ధతిని నిరోధించడం వంటి నియమాలు పాటిస్తే కొత్తవాళ్లు బ్రాందీ షాపుల వద్దకు వెళ్లరు. కానీ ప్రతి సందుకు, గొందికి ఒక అంగడి పెట్టి, పెద్ద పెద్ద ప్రచార ప్రకటనలతో యువకులను ఆకర్షించి, అర్ధరాత్రి అపరాత్రి తేడా లేకుండా అమ్మకాలు జరపడం వల్ల ఆ అలవాటులేని వారు సైతం ఆకర్షితులౌతున్నారు. ప్రభుత్వానికి ప్రజల ఆరోగ్యం పట్ల, ఆర్థికస్థితి పట్ల నిజమైన చిత్తశుద్ధి వుంటే ఈ విశృంఖల వ్యాపారానికి అడ్డుకట్ట వేయాలి. రాష్ట్రాన్ని మద్యాంధ్రప్రదేశ్‌గా మార్చి, ఆ రాబడితో అభివృద్ధి కార్య క్రమాలు అమలు చేసే కంటే, ఏ అభివృద్ధీ లేకుండా ప్రజ లను వారి మానాన వారిని బ్రతకనివ్వడం మేలు. రోశయ్య వంటి పెద్ద మనిషి, ఏ వ్యసనమూ లేని నిఖార్సైన నాయ కుడు కూడా మద్యంతో ప్రభుత్వాన్ని నడపాలనుకోవడం బాధాకరం.

జమీన్‌రైతు

## జనవాణి

### జడ్పీ ఛైర్మన్ అభినందనీయుడు!

నెల్లూరు జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా కాకాణి గోవర్ధన్‌రెడ్డి పదవీ బాధ్యతలు చేపట్టి జులై 23వ తేదీకి నాలుగేళ్లు పూర్తయ్యింది. గతంలో పేరుపొందిన జడ్పీ ఛైర్మన్లకంటే మిన్నగా గోవర్ధన్‌రెడ్డి పనిచేశారనాలి. ఆఫీసుకు తన స్వంత కారులో వెళ్తారు. తన నెల జీతం జడ్పీలోని నాల్గవ తరగతి ఉద్యోగుల పిల్లల సంక్షేమానికి ఇస్తున్నారు. స్వంత నిధులతో పదవ తరగతిలో మంచి మార్కులు తెచ్చుకొన్న విద్యార్థులకు ప్రోత్సాహకాలిస్తున్నారు. జడ్పీ ఛైర్మన్ కప్ పోటీలు, మంచి పాలన, ఇసుక టెండర్ల దోపిడీని ఎదుర్కొని జడ్పీ ఖాతాలో 30 కోట్లు జమ అయ్యేలా చేయడం మామూలు విషయమేమీ కాదు. జడ్పీ ఛైర్మన్‌గా నూతన ఒరవడిని సృష్టించిన గోవర్ధన్‌రెడ్డి భావితరాలకు ఆదర్శప్రాయుడన డంలో సందేహం లేదు.

గడ్డం తిరుపాలురెడ్డి — మహమ్మదాపురం

### థర్డు డిగ్రీ మానండి!

థర్డు డిగ్రీ అంటే ఖైదీని హింసించడం. అది ఏనాడో నిషేధించారు. కానీ పోలీసులు ఏదో ఒక రూపంలో హింసిస్తూనే వున్నారు. ఓ మాజీ ముఖ్యమంత్రి, ఎమ్పీ, ఎమ్మెల్యేలు వారిలో మహిళలని చూడకుండా మహారాష్ట్ర పోలీసులు లాఠీలతో కొట్టారంటే అది మామూలు విషయం కాదు. ప్రతి వ్యవహారంలోనూ ఇండియన్ పోలీసు అదుపు తప్పి వ్యవహరిస్తున్నారు. శాంతి భద్రతలను కాస్త అదుపులో పెట్టమంటే కాళ్ళుల వరకు తెగబడుతున్నారు. దేశంలోని పోలీసుల మానసిక స్థితిలో మార్పుకు కేంద్ర ప్రభుత్వమే శ్రీకారం చుట్టాల్సి వుంది.

టి.కోటేశ్వరరావు — కోవూరు

### నెల్లూరు నాయకులు అష్టదిగ్గజ కవులా?

శ్రీకృష్ణదేవరాయలు పంచమ శతాబ్ది పట్టాభిషేక ఉత్సవాలను ఉదయ గిరిలో ప్రభుత్వ సొమ్ముతో మేకపాటి సోదరులు మహా బాగా నిర్వహించారు. ఈ సభలో నెల్లూరు నేతల మాటలు కోటలు దాటాయి. అత్యంత వైభవం, నీతి నిజాయితీలతో పరిపాలన సాగించిన రాయలును వైఎస్ సర్కారుతో పోల్చడం విడ్డూరం. ఈ వేదికపై వివేకా తెనాలి రామలింగుని పాత్ర పోషించాడనాలి. విజ్ఞులైన మాగుంట పార్వతమ్మ సైతం పొగడ్తల బాట పట్టడం బాధాకరం. శ్రీకృష్ణదేవరాయలు ప్రతినిధిగా కొండ మురసయ్య కలువాయి, అనంతసాగ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

9-8-1940
పేజీలు : 16 వెల: అణా

### సర్దారుజీకి మహాత్ముని క్షమాపణ

ఇంగ్లీషులో వెలువడే హరిజన పత్రికకు గుజరాతీ ప్రతియైన 'హరిజన బంధు'లో సర్దారు వల్లభాయి పటేలుకు, తనకు అహింసాతత్వంలో గల్గిన భేదాభిప్రాయాలను గూర్చి వ్రాస్తూ గాంధీజీ కొన్ని కటువైన వాక్యాలను వ్రాసినాడట. ఈ సంగతిని 'హరిజన బంధు' చదువరి యొక పెద్ద మనిషి గాంధీజీ నోటీసులోనికి తెచ్చి, ఇందులో హింసలేదా అని గాంధీజీని ఆ చదువరి ప్రశ్నించాడు. సహజ ఔదార్య గుణశాలియగు గాంధీజీ ఆ చదువరి చెప్పినది నిజమేనని ఒప్పుకున్నాడు. తప్పకుండా తాను వ్రాసిన వాక్యాల్లో హింస వున్నదన్నాడు. ఆ వాక్యాలను తానెట్లు వ్రాయగలిగినాడో తనకు తోచడం లేదన్నాడు. అట్లు వ్రాసినందుకు సర్దారుజీకి క్షమాపణ వేడుకున్నాడు.

### రంగు నిషేధం

బ్రిటీషు యుద్ధ కార్యాలయంలో ఉద్యోగం కోసం ఎం.దేవ యనే భారతీయుడు అప్లికేషన్ వేసినాడు. అతడు ఎడింబర్గులో చదివి ఎం.ఎ ప్యాసయినాడు. ఉద్యోగానికి తగిన అర్హత వున్నది. కానీ రంగు మార్చుకోడానికి వీలులేకపోయినందు వల్ల ఉద్యోగం దొరకలేదట. 'నల్ల' వారికి యుద్ధ కార్యాలయంలో ఉద్యోగమేమిటియని చెప్పి దేవగారి అప్లికేషన్ యుద్ధ కార్యాలయంలో త్రోసి వేయబడినదట.

### నెల్లూరు బజారు ధరలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాత మొలగొలుకులు | – | రూ.అ.పై | కొత్త బియ్యం | – | 14-4-0 |
| 1వ రకం 98 శేర్ల బస్తా | – | 6-8-0 | జొన్నలు 1120శేర్లు | – | 80-0-0 |
| కొత్త మొలగొలుకులు | – | 6-6-0 | రాగులు 1120 శేర్లు | – | 72-0-0 |
| పాత బియ్యం 105 శేర్ల బస్తా | – | 15-0-0 | | | |

## 50 ఏళ్ల క్రితం ఈవారం

5-8-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఎన్నిక రద్దుకు కారణం

రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికల సంఘం రద్దుకు కారణం ప్రతి సభ్యుడు తొమ్మిది మందికీ ఓటువేసి తీరాలనే అధ్యక్షుని రూలింగు కాదు; బ్యాలట్ కాగితాల అమర్పులో లోపం కాదు; ఎన్నికను రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు జరపాలా లేక ఎన్నికాధికారి జరపాలా అనేది కాదు; అసలు ఎన్నిక నిర్వహణలో రహస్యాన్ని పాటించక పోవడమేనని శ్రీవంత్ తన తీర్పులో వెలిబుచ్చారు. రహస్యం పాటించక పోవడమనేది శ్రీరాజగోపాలన్ విచారణ సందర్భంలో రుజువైంది. ప్రదేశ్ కాంగ్రెస్ కార్యదర్శి, ఆనాటి ఎన్నికాధికారి అయిన పెమ్మరాజు వెంకట్రావు గారే దీనిని రాజగోపాలన్ ముందు అంగీకరించారు. కడకు ఎన్నికాధికారి వాజ్ఞూలమే ఎన్నిక రద్దుకు కారణమైంది. ఇది మంత్రి వర్గీయులు తమకు తాము చేజేతులా జేసుకొన్న అపకారమే.

### కరెన్సీ నోట్లు మ్రింగిన డాక్టరు

వాల్తేరులోని రైల్వే ఆసుపత్రిలో అసిస్టెంట్ సర్జన్‌గా పనిజేస్తున్న డాక్టర్ ఏ.కె.మజుందార్ వద్దకు క్షయ వ్యాధి సోకిన ఒక రైల్వే కార్మికుడు వెళ్ళి, విశాఖపట్నంలోని కింగ్ జార్జి ఆస్పత్రిలో జేరడానికి సర్టిఫికేట్ అడు గగా లంచమిస్తేగానీ సర్టిఫికేట్ ఇవ్వనని డాక్టర్ అనగా, ఆ కార్మికుడు ముందుగా ఆ విషయం పోలీసుకు రిపోర్టుజేసి లంచ మిచ్చాడట. డాక్టర్ మజుందార్ లంచం పుచ్చుకున్నాడన్న అనుమానంపై సిఐడి శాఖవారు ఆయనను సోదా జేయడానికి వెళ్లగా, ఆ డాక్టర్ గబాలున తన జేబులో నుంచి మూడు ఐదు రూపాయల నోట్లను త్రీసి మ్రింగేశాడట.

### విఆర్ హైస్కూల్ భూముల వేలం

మాచవోలు రాఘవయ్య గారనే విద్యాభిమానియైన ఒక ఔదార్యవంతుడు 20-11-1917న విఆర్ హైస్కూలుకు దానంగా వ్రాసియిచ్చిన నెల్లూరు తాలుకా కోడూరు – ఈదూరు – తోటపల్లి గ్రామాలలోని య.19.60 సెంట్ల మాగాణి, య.24.78 సెంట్ల మెట్ట భూములు గత 31వ తేది బహిరంగంగా వేలం వేయబడినవి.

# నెల్లూరు ముచ్చట్లు

## వెంకయ్యనాయుడికి గోపాలరెడ్డి అవార్డు!

ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్ స్వర్గీయ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి స్మృత్యంకంగా ప్రతి ఏడాది ఇస్తున్న అవార్డుకు ఈ యేడాది బిజెపి జాతీయ నేత, రాజ్యసభ సభ్యుడు ఎం.వెంకయ్య నాయుడిని ఎంపిక చేశారు. 8వ తేది సాయంత్రం టౌన్‌హాల్‌లో జరిగే అవార్డు ప్రధానోత్సవ సభకు మాజీ గవర్నర్ వి.ఎస్.రమాదేవి, మంత్రి రామనారాయణరెడ్డి, జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి, పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ తదితరులు హాజరవుతారు.

## నెల్లూరుకు చిరంజీవి రాక!

ప్రజారాజ్యం పార్టీ అధ్యక్షుడు చిరంజీవి తన ప్రజాచైతన్య యాత్రను నెల్లూరు జిల్లా నుంచే ప్రారంభించను న్నారు. 7వ తేది రాత్రి కావలి చేరుకునే ఆయన 8వ తేది కావలి పట్టణంలో ర్యాలీ అనంతరం బహిరంగసభ నిర్వ హిస్తారు. ఈ కార్యక్రమం విజయవంతం చేయను కావలిలో ఆ పార్టీ ఇన్‌ఛార్జ్ ప్రతాప్‌కుమార్‌రెడ్డి శ్రమిస్తున్నారు. కావలి పర్యటన ముగిశాక చిరంజీవి మార్గమధ్య మంలోని నార్తురాజుపాళెం, కోవూరుల లోనూ ఏర్పాటుచేసే రోడ్‌షోలో పాల్గొం టారు. సాయంత్రం ఆరు గంటలకు నెల్లూరు విఆర్ కాలేజీ నుంచి రోడ్‌షో చేసే చిరంజీవి గాంధీబొమ్మ వద్ద ఏర్పాటుచేసే బహిరంగసభలో మాట్లాడు తాడు. రాత్రికి నగరంలో బస చేసి 9వ తేది ఉదయం పాత్రికేయులతో మాట్లా డుతారు. అనంతరం తన అభిమానుల సదస్సులో పాల్గొని సాయంత్రంగా వెంకటాచలం, గూడూరు, వెంకటగిరి లలో పర్యటిస్తారు. ఇక్కడ నుంచి తిరుపతి వెళ్తారాయన. అసెంబ్లీ ఎన్నికల య్యాక సుదీర్ఘ విరామం తర్వాత చిరంజీవి నెల్లూరు పర్యటనకు వస్తున్నారు.



## బుట్టలోళ్ల ఉసురు తగలదా?

నెల్లూరు నగరంలో ట్రాఫిక్ సమస్యకు ఏసి మార్కెట్ వద్ద రోడ్డు మార్జిన్‌లో బుట్టల్లో తాజా కూరగాయలు పెట్టుకొని అమ్మేవారు కారకులని ఆగమేఘాల మీద పోలీసులు వారిని అక్కడ నుంచి తరిమివేశారు. ఈ వ్యవహారమై సిపిఎం పార్టీ చేసిన ఆందోళనను ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పట్టించుకోలేదు. జిల్లా కలెక్టర్, ఎస్పీల మీద ఆయన చేసిన ఒత్తిడి మూలంగా వాళ్లు బుట్టలోళ్ల జీవనాధారం విషయమై మానవత్వ ధోరణిలో ఆలోచించలేదు. మార్కెట్ వద్ద వందల సంఖ్యలో బుట్టల్లో కూరగాయలు పెట్టుకొని అమ్ముకునేవారు మరో గత్యంతరం లేక చెట్టుకొకరు పుట్టకొకర య్యారు. వీరిలో పాతిక మంది రామలింగాపురంలోని బ్రిడ్జి ప్రక్కన బుట్టలు పెట్టుకొని కూరగాయలు అమ్ముకొంటు న్నారు. బుట్టల్లో కూరగాయలు పెట్టుకొని అమ్మేవారికి న్యాయం చేసే పూచి తనదని వివేకానందరెడ్డి బొబ్బిలి బ్రహ్మన్న స్టైల్‌లో చెప్పారు. కానీ పూటగడవని అభాగ్యులకు న్యాయం చేసే విషయాన్ని మరిచారు. పొట్ట కొట్టకూడదని పెద్దలంటారు. బుట్టలోళ్ల ఉసురు ఈ తొలగింపులో ప్రమేయం వున్న వారందరికీ తగిలి తీరుతుంది.

## తగ్గిన టమోటా – తగ్గని వంకాయ!

గత మాసంతో పోల్చితే ఈ మాసారంభంలో కూరగాయల రేట్లు ఏసి మార్కెట్‌లో కాస్త తగ్గాయి. కిలో 30 రూపాయలు అమ్ముతుండిన టమోటా ఐదు రూపాయలయ్యింది. బెండ, ఉర్లగడ్డ, చేమగడ్డ, క్యాబేజి, క్యారట్, బీన్స్ రేట్లు కూడా అందుబాటులోనే వున్నాయి. కానీ నెల్లూరీయులు ప్రియంగా తినే వంకాయ కిలో 20 రూపాయలకు ఏ మాత్రం తగ్గక తన బిర్రు చూపిస్తుంది.

## ట్రంకురోడ్డులో అంధకారం!

నెల్లూరు నగరంలో అంధకారం రాజ్యమేలుతుంది. సందు గొందుల్లో వీధి దీపాల గుర్చి కార్పొరేషన్ పాలకులు పట్టించుకోవడమే లేదు. మెయిన్ ట్రంకు రోడ్డులో పెద్దాసుపత్రి నుంచి అయ్యప్ప గుడి జంక్షన్ వరకు చీకట్లోనే పయనించక తప్పడం లేదు. ఈ యేడాది నగరంలో వీధిలైట్లు ఏర్పాటుకు బడ్జెట్‌లో ఏడు కోట్ల రూపాయలు ప్రతిపాదించారు. ఈ మొత్తంతో నగరంలో నిశిధి సమయంలోనూ పట్టపగలు చేయవచ్చు. కానీ నిధులన్నీ పాలకులు, అధికార గణం తిని అరాయించుకోనే సరిపోతున్నది.

## డెంగీ జ్వరాలు

పారిశుధ్య పరిస్థితులు మరీ క్షీణించడంతో జిల్లాలో డెంగీ జ్వరాలు ఎక్కువయ్యాయి. ఆత్మకూరు మసీదు వీధికి చెందిన బాలుడు సాదిక్, మనుబోలు మండలం పిడూరుపాళెం సర్పంచ్ సతీమణి ప్రసూనమ్మ డెంగీ జ్వరంతో కన్నుమూశారు. నాయుడుపేటలో ఓ యువతిని ఈ పాడు జ్వరం పొట్టన బెట్టుకొంది. జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారులు మాత్రం జిల్లాలో డెంగీ జ్వరాలే లేవని కల్లబొల్లి కబుర్లు చెబుతున్నారు. ఈ సీజన్‌లో విజృంభించే ఈ జ్వరం బారి నుంచి ప్రజలను ఆ దేవుడే కాపాడాలి.

## నెల్లూరులో జనానికి మించి బార్లు!

నగరాలు, పట్టణాల్లో జనాభా సామర్థ్యాన్ని బట్టి బార్లు ఏర్పాటు చేయాలన్న ప్రభుత్వ నిర్ణయం విమర్శల పాలయ్యింది. అయితే విచిత్రంగా నెల్లూరు నగరంతోపాటు కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాలిటీలలో జనాభా సామర్థ్యానికి మించి ఎక్సైజ్ శాఖ బార్లకు లైసెన్సు ఇచ్చి వుంది. నెల్లూరు జనాభాను బట్టి 28 బార్లు ఉండాల్సి వుండగా 37 బార్లకు లైసెన్స్ ఇచ్చారు. కావలిలో నాలుగు బార్లు ఉండాల్సి వుండగా ఎనిమిది, గూడూరులో మూడుకు బదులు నాలుగు, వెంకటగిరిలో రెండుకు బదులు ఐదు బార్లు హాయిగా నడుస్తున్నాయి. ఎక్సైజ్ శాఖ జనాభాకు మించి నెల్లూరులో బార్లకు లైసెన్సులు ఇచ్చిన విషయమై ప్రశ్నించే రాజకీయ పార్టీలు, స్వచ్ఛంద సంస్థలు, మహిళా సంఘాలు లేకుండా పోయాయే?

## నెల్లూరులో గ్లోబల్ ఆసుపత్రి

నెల్లూరీయుడు దేశవ్యాప్తంగా పలు ప్రాంతాల్లో అంతర్జాతీయ ప్రమాణాలతో గ్లోబల్ హాస్పిటళ్లను ఏర్పాటు చేసి జిల్లా ఖ్యాతి పెంచుతున్న డాక్టర్ కంచర్ల రవీంద్రనాథ్ నెల్లూరులోనూ గ్లోబల్ ఆసుపత్రిని ఏర్పాటు చేస్తానని ప్రకటించారు. 1వతేది నెల్లూరులో విలేఖరులతో మాట్లాడిన ఆయన గ్లోబల్ ఆసుపత్రులు హైదరాబాద్, బెంగుళూరు, ఢిల్లీలలో ప్రజలకు సేవలందిస్తూ దేశంలో మూడవ స్థానంలో నిలిచాయని, వీటిని మరికొన్ని నగరాలకు విస్తరిస్తున్నామన్నారు. కలకత్తాలో గ్లోబల్ ఆసుపత్రి నిర్మాణానికి అక్కడి ప్రభుత్వమే స్థలం ఇచ్చిందన్నారు. నెల్లూరులో గ్లోబల్ ఆసుపత్రి నిర్మాణం రెండేళ్లలో పూర్తి చేస్తామన్నారు.



నెల్లూరు తిక్కన రచయితల సంఘం నిర్వహించిన కవి సమ్మేళనంలో పాల్గొన్న కవి ఇసనాక దయాకర్‌రెడ్డికి జ్ఞాపిక బహుకరిస్తున్న నగర ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి. ప్రక్కన ఆంజనేయరాజు, ఆచార్య ఆదిత్య, దేవరాల సుబ్రహ్మణ్యం తదితరులు.

## గడగడలాడించిన దొంగలు

నెల్లూరు బాలాజీనగర్‌లోని మూడిళ్లలో 1వ తేది రాత్రి వరుసగా దొంగతనాలు చేసి దొంగలు పోలీసులకు సవాలు విసిరారు. మొత్తం మీద 90 సవర్లకు పైగా బంగారాన్ని పట్టుకెళ్లారు. రామ్‌నగర్ ప్రాంతీయుడు శ్రీధర్‌రెడ్డి ఇంట్లోనే 78 సవర్ల బంగారం పోయింది. జైలు నుంచి విడుదలైన పాత నేరస్తులు ఈ దొంగతనాలు చేసి వుంటారని పోలీసులు అనుమానిస్తున్నారు.

## నెల్లూరు ది బెస్ట్!

నెల్లూరులోని బిఎస్ఎన్ఎల్ మొబైల్ నెట్ వర్క్ పనిచేసే విధానంలో దేశం మొత్తం మీద అత్యుత్తమమైనదిగా సాంకేతిక అభివృద్ధి విభాగం జరిపిన సర్వేలో తేలిందని టెలికాం జిఎం గోపి చెప్పారు. సర్వేలు చూసి సంతోషపడక తక్షణ సేవలు ఎప్పటికప్పుడు ఆధునిక తను మీ ధోరణిలో కొనసాగించండి సార్!

## వాణిజ్య పన్ను శాఖకు కొత్త ఉప కమిషనర్

నెల్లూరు వాణిజ్య పన్ను శాఖ ఉప కమిషనర్‌గా ఇంతియాజ్ 2వ తేది బాధ్యతలు తీసుకొన్నారు. విజయవాడలో పని చేస్తూ నెల్లూరుకు బదిలీపై వచ్చారాయన. పాత కమిషనర్ వెంకటేశ్వరరావు పదవీ విరమణ చేయడంతో ఈ పోస్టు ఖాళీగా వుండింది.

## సోమశిలకు జలకళ!

నెల్లూరులో చెప్పుకోతగ్గ వర్షాలు లేకపోయినా ప్రాజెక్ట్ పరివాహక ప్రాంతాల్లో వర్షాలు కురవడంతో సోమశిలలో 34 టిఎంసిల నీళ్లు వచ్చి చేరాయి. ప్రతినిత్యం పెన్నా డెల్టాకు 1500 క్యూసెక్కులు, ఉత్తర కాల్వకు 50 క్యూసెక్కుల నీటిని ప్రాజెక్ట్ నుంచి విడుదల చేస్తున్నారు.

## అపశకున పక్షుల వల్లే ఓటమి

ఏ అంశంపైన అయినా వెను వెంటనే మీడియా ముందు స్పందించే నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానంద రెడ్డి తెలంగాణ ప్రాంతంలో జరిగిన ఉప ఎన్నికల్లో పార్టీ ఓటమిపై 1వ తేది మాట్లాడారు. పార్టీ అక్కడ అపశకున పక్షుల వల్లే ఓడింది. కాంగ్రెస్‌ను ఓడించే వారు లేరు. పార్టీలోని వారే పార్టీని ఓడిస్తారు. శుభం పలకరా సుబ్బన్నా అంటే మా పార్టీనేతలే అవాకులు చెవాకులు పేలి పార్టీ ప్రతిష్టను దిగజార్చారని వివేకానందరెడ్డి తన నోటికి అడ్డూఆపు లేకుండా చెప్పుక పోయారు.

## ఎంసెట్ మెడికల్‌లో జిల్లా టాపర్!



ఎంసెట్ ప్రవేశ పరీక్ష వ్రాసి మెడికల్ విభాగంలో 159 మార్కులకు గాను 149 మార్కులు తెచ్చుకొని నెల్లూరు విద్యార్థి అన్నదేవుల కేశవనరేంద్ర మోహన్‌రెడ్డి రాష్ట్రస్థాయిలో ఎనిమిదవ ర్యాంకును, జిల్లాస్థాయిలో ప్రథమునిగా నిలిచాడు. హైదరాబాద్‌లోని గాంధీ మెడికల్ కాలేజీలో ప్రవేశార్హత పొందిన నరేంద్రమోహన్‌రెడ్డి తన విజయానికి మేనమామ విఆర్‌కాలేజీలో ఫిజిక్స్ లెక్చరర్ డాక్టర్ వి.రంగారెడ్డి ఇచ్చిన శిక్షణనే కారణమంటున్నాడు. తల్లితండ్రులు డాక్టర్ శోభారాణి, విజయమోహన్‌రెడ్డి విద్యాధికులు కావడం కూడా తనకు కలిసి వచ్చిందన్నాడు.

# పెరిగిన రిజిస్ట్రేషన్ శాఖ ఆదాయం

ప్రభుత్వం ఆదాయ వనరుల పెంపుదలలో భాగంగా ముందు వెనుక ఆలోచించకుండా పన్నుల భారం పెంచి వీరబాదుడుకు సిద్ధపడుతున్నది. ఆగష్టు 1వ తేది నుంచి భూములు, భవనాలు, ఇతర స్థిరాస్తులు విలువలను విపరీతంగా పెంచేసినట్లు ఉత్తర్వులు జారీ చేసింది. ఈ ప్రక్రియలో ఎక్కడా



అన్ని వ్యవహారాలకు మౌనసాక్షి నెల్లూరు రిజిస్ట్రారు కార్యాలయం.

శాస్త్రీయత, హేతుబద్ధత పాటించలేదు. ఆదాయం పెంచుకోవడమే లక్ష్యంగా వ్యవహరించింది. ఈ వీరబాదుడు మూలంగా జిల్లాలో రిజిస్ట్రేషన్ల శాఖ ఆదాయం సంవత్సరానికి 117 కోట్ల రూపాయలు కానుంది. గతంలో నగరాల్లో, గ్రామాల్లో స్టాంపు డ్యూటీ రేట్లు ఒకే విధంగా వుండేవి. పట్టణాల్లో తగ్గిస్తూ గ్రామీణ ప్రాంతాల్లో నివాస ప్రాంతాలు, వ్యవసాయ భూమి, రహదారి ప్రక్కన భూములు, మురికి వాడలు, వాణిజ్య భవనాలు, పారిశ్రామికంగా ఉపయోగపడే భూములకు ఒకే రకం రిజిస్ట్రేషన్ ఛార్జి అనువర్తింపజేస్తామన్న గుడ్డి నిర్ణయాన్ని ప్రకటించారు. దీనివల్ల గ్రామాల్లో వుండిన 20కి పైగా ఆస్తి వర్గీకరణలు రద్దయినట్లే. పట్టణాల్లో ఏ లాబీ పనిచేసిందో ఏమో ఈ వర్గీకరణలు తొమ్మిదింటిని ఏడుగా చేశారు. అయినా ఇది కూడా సహేతుకంగా లేదు.

## ఇష్టమొచ్చినట్లు చార్జీల పెంపుదల

ఆత్మకూరు బస్టాండ్ మొదలుకొని సుబేదార్‌పేట మీదుగా జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి కార్యాలయం వరకు ఖాళీ స్థలాలకు, భవనాలకు ఒకే రిజిస్ట్రేషన్ రేటు నిర్ణయించడం సహేతుకంగా లేదు. ఆర్.ఆర్‌వీధి నుంచి విఆర్‌సి వరకు ఒకే రేటు వంటివి సహేతుకంగానే వున్నాయి. రిజిస్ట్రేషన్ రేట్లు విపరీతంగా పెరిగి పోతున్నాయన్న నేపథ్యంలో జులై 31వ తేది నెల్లూరు మెయిన్, స్టోన్‌హౌస్‌పేట, బుజబుజ నెల్లూరు, ముత్తుకూరు రిజిస్ట్రేషన్ ఆఫీసుల్లో శనివారమైనా వందలాది రిజిస్ట్రేషన్లు జరిగాయి. రిజిస్ట్రేషన్ల రేటు పెంపుదల సహేతుకంగా లేకపోయినా కోర్టుకు వెళ్లేవారు లేకపోవడంతో ఈ వ్యవహారంలో ప్రభుత్వ వైఖరి ఏకపక్షంగా వుందని చెప్పక తప్పదు.



టిబి హాస్పిటల్ ప్రాంగణంలో నిర్మాణ దశలో కొత్త కార్పొరేషన్ ఆఫీసు.

# హడావుడిగా కార్పొరేషన్ భవన నిర్మాణ పనులు!

ఏళ్ల తరబడి పెండింగ్‌లో వుండిన నెల్లూరు కార్పొరేషన్ భవన నిర్మాణం పనులను మూడంటే మూడు నెలల్లో హడావుడిగా చేపట్టడం చర్చనీయాంశమయ్యింది. నెల్లూరు మునిసిపాలిటీగా వున్నప్పుడే ఊరి మధ్యలో కార్యాలయ భవనం కట్టాలన్న ప్రతిపాదన వచ్చింది. ఫత్తేఖాన్‌పేటలో ప్రస్తుతం రైతుబజారు నిర్మించిన చోట దీన్ని కట్టాలనుకొన్నారు. ఆతర్వాత ఆ ఫైలును తీసి మూలన పెట్టేశారు. భానుశ్రీ మేయర్ అయ్యాక తన హయాంలో ఏదో ఒక పని నిలచిపోయేలా చేయాలని తలచారు. ఆమె కళ్లలో ఆనందం చూడాలని తహతహలాడే నాయకుని చొరవతో కార్పొరేషన్ భవన నిర్మాణానికి రెండు కోట్ల రూపాయల నిధులు మంజూరయ్యాయి. పలు వివాదాలు రేగిన క్షయాసుపత్రి కాంపౌండ్‌లో దీన్ని కట్టాలని తీర్మానించారు. ఆ తర్వాత ఈ భవనాన్ని ఇంకా అద్భుతంగా కట్టాలని 5.25 కోట్ల రూపాయలకు నిర్మాణ వ్యయం అంచనా పెంచారు. ఇటీవల చెన్నైలో కట్టిన సెక్రటేరియట్ నమూనాలో దీన్ని రూపొందించాలని మేయరమ్మ తలపోయడమే తడువు బిపిఎస్ మరియు ఎల్ఆర్‌పి పథకాల ద్వారా వసూలైన నిధులు 4.25

## మేయర్ కళ్లలో ఆనందం చూడనే ఇదంతా...

కోట్లు భవన నిర్మాణానికే ఏకపక్షంగా వెచ్చించ తలపెట్టారు. 9.50 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి నిర్మిస్తున్న ఈ భవనాన్ని ఏవిధంగానైనా ఈ నెలలోనే ప్రారంభోత్సవం చేసి చివరి కార్పొరేషన్ సమావేశం దీనిలో పెట్టాలని పనులు గందరగోళంగా చేపడుతున్నారు. భవన నిర్మాణంలో సిమెంటు, ఆ తర్వాత చేసే పనులకు కొంత వ్యవధి కావాలి. వీటిని పట్టించు కోకుండా చేపడుతున్న పనుల వల్ల నాణ్యత లేకుండా పోవచ్చు. పది కోట్ల రూపాయల ప్రజాధనం వృధా కావచ్చు. భవిష్యత్తులో ఏదైనా జరగవచ్చు. ఇదే సందేహాన్ని ఇటీవల భవన నిర్మాణ పనులను పర్యవేక్షించిన ప్రతిపక్షీయులైన సిపిఎం, తెలుగుదేశం కార్పొరేటర్లు వ్యక్తం చేశారు. హడావుడిలో పలు అసంపూర్తి నిర్మాణాలు చేస్తున్నారని మేయర్, కమిషనర్ ఛాంబర్లతోపాటు ఉపమేయర్, అన్ని పార్టీల వారికి అసెంబ్లీలో మాదిరి ఛాంబర్లు ఏర్పాటు చేయాలని కోరారు. కానీ ఈ విజ్ఞాపనలు పట్టించుకొనే వారే ఇక్కడ లేరు. మేయరమ్మ కళ్లలో ఆనందం చూడాలన్న ఒకే ఒక్క అజెండాతో ఈ భవన నిర్మాణం పూర్తవుతుందంతే!

# తగ్గుతున్న 108 సేవలు!

## ఫోన్ చేసిన వాడికి సవాలక్ష ప్రశ్నలు

ప్రాణరక్షిత వాహనంగా పేరుబడ్డ 108 వాహన సేవలు రాను రాను తగ్గిపోతున్నాయి. దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డికి అత్యంత ప్రీతిపాత్రమైన వాహనం 108. ఆయన బ్రతికున్న సమయంలో బహిరంగ సభల్లో 108కు ఫోన్ చేస్తే చాలు కుయ్ కుయ్ అంటూ వచ్చి వైద్యసేవలందిస్తాయని చెప్పేవారు. ఆయన మరణించాక 108 వాహనాల సేవల పట్ల రోశయ్య ప్రభుత్వం శ్రద్ధ చూపక పోవడంతో ఫోన్ చేసిన వెంటనే ఆ వైపు ఫోన్ ఎత్తుకొన్న వారు సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. 31వ తేది అర్ధరాత్రి బుజబుజనెల్లూరు దగ్గర జరిగిన రోడ్డు ప్రమాదంలో ముగ్గురు హోంగార్డులు తీవ్రంగా గాయపడ్డారు. ఈ విషయమై పలువురు 108కి ఫోన్లు చేసినా స్పందించింది తక్కువే. గంటసేపు చూశాక ఓ ఆటోడ్రైవర్ మానవతా దృక్పథంతో ఈ ముగ్గురు హోంగార్డులను పెద్దాసుపత్రికి తరలించాడు. పట్టణ ప్రాంతంలోనే ఈ విధంగా 108 సేవలు అందుతుంటే గ్రామీణ ప్రాంతాల్లో ఏవిధంగా వుంటాయన్నది అర్థం చేసుకోవచ్చు. రోజుకు మూడుసార్లు మాత్రమే ప్రమాద స్థలాలకు వెళ్లాలని 108 సిబ్బందికి సూచనలుండడంతో ఒకే రోజు అంతకన్నా ఎక్కువ ప్రమాదాలు జరిగితే హాజరు కావడం లేదు.




ఇలా అయితే ఎలా?

ఏది ఏమైనా 108 పథకంపై ఆంక్షలు, ఆపద సమయంలో అక్కరకు రాకుండా చేయడమేననాలి.

# ఎసి స్టేడియంలో కరువైన సౌకర్యాలు!



ఎసి స్టేడియం(ఫైల్‌ఫోటో).

పేరుగొప్ప ఊరు దిబ్బలా వుంది ఎసి స్టేడియం పరిస్థితి. జిల్లా పరిషత్ ఛైర్మన్ కప్, ఉద్యోగ సంఘాల క్రీడాపోటీలు తదితర ఎన్నో ప్రతిష్టాత్మక క్రీడాపోటీలకు స్టేడియం వేదికవుతుంటే, మరోవైపు కనీస సౌకర్యాలు కొరవడి క్రీడాకారులు పలు అగచాట్లు పడాల్సి వస్తోంది. ముఖ్యంగా మైదానం చదును చేయకపోవడంతో గుంటలు మిట్టలుగా తయారైంది. దీంతో క్రీడాకారులు ఇక్కడ పరుగెత్తేటప్పుడు పడి గాయాలపాలవుతున్నారు. ఇండోర్ స్టేడియం పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. శుభ్రత లేకపోవడం, అభివృద్ధి గురించి పట్టించుకోక పోవడంతో దుర్వాసన వెదజల్లుతోంది. మరుగుదొడ్ల పరిస్థితి చెప్పనవసరం లేదు. ఇక్కడే షటిల్ ఆడే క్రీడాకారుల వద్ద నుంచి నెల నెల కొంత మొత్తం వసూలు చేస్తున్న క్రీడాప్రాధికార సంస్థ దీనికి తగ్గట్లు వసతులు కల్పించుటలో మాత్రం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నది. చివరకు మైదానంలో గడ్డి పీకే దిక్కు లేదు. సంస్థకొచ్చే నిధులు ఖర్చవుతున్నాయి గానీ కనీస సౌకర్యాలకు మాత్రం నోచుకోకపోవడంతో స్టేడియంకు వచ్చే క్రీడాకారులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు.

# బ్లాక్ టిక్కెట్ల అమ్మకాల్లో చోటాలు!




బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మేవారికి ఉపయోగపడుతున్న ఈ-సేవా కేంద్రం.

అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల, కుక్కపిల్ల కాదేదీ కవితకనర్హమన్నట్లు ప్రజల సొమ్మును దిగమింగే రాజకీయ నేతల చోటామోటాలకు ఏదీ వృధాకానట్లుంది. పేదలకు కట్టే ఇళ్ల నిర్మాణాలు, రేషన్‌కార్డులు, పింఛన్ల సొమ్మును దిగమింగుతున్న నేతలు సినిమా టిక్కెట్లను తమ ఆదాయ వనరుగా మలచుకొన్నారు. రూరల్ ఎమ్మెల్యే వివేకా అనుచరులది ఇందులో అందెవేసిన చేయి. వివేకా అనుచరులుగా చలామణి అవుతున్న కొందరు సినిమా టిక్కెట్లపై కన్నేశారు. ప్రముఖ హీరోలు నటించిన సినిమాల టిక్కెట్లను పెద్ద సంఖ్యలో ముందుగానే హస్తగతం చేసుకొని వాటిని బ్లాక్‌లో విక్రయిస్తూ వేలాది రూపాయలు గడిస్తున్నారు. ఆయా థియేటర్ల యాజమాన్యాలు, నిర్వాహకుల వద్దకు వెళ్లి అదిరించి, బెదరించి టిక్కెట్లు అధికంగా సంపాదించి వాటిని తమ మనుషులను పెట్టి అమ్మించి సొమ్ము చేసుకొంటున్నారు. ఈ సేవా కేంద్రాల వద్ద ఎమ్మెల్యే మనుషులమంటూ అక్కడ కూడా టిక్కెట్లు తీసేసుకొని మొత్తం సినిమా హాళ్ల వద్ద బ్లాక్‌లో బహిరంగంగా విక్రయిస్తూ జేబులు నింపుకొంటున్నారు. రాజకీయ అండదండలుండడంతో సినిమా హాళ్ల యాజమాన్యాలు ఎటూ చెప్పలేక పోతున్నారు.

# దళితుల సంక్షేమం దేముడెరుగు!

**జిల్లాలోని సాంఘిక సంక్షేమ శాఖాధికారులు హాస్టళ్ల నిర్వహణ, స్కాలర్ షిప్పుల మంజూరుకు పరిమితమయ్యారు. వీటిని సక్రమంగా అందిస్తున్నారంటే పొరపాటే. ఇక్కడ కూడా అవినీతి అక్రమాలకు పాల్పడడం రివాజుగా మారింది.**




నెల్లూరులోని సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయం. (ఫైల్‌ఫోటో)

రాష్ట్ర ప్రభుత్వం దళితులు, దళిత విద్యార్థుల సంక్షేమం కోసం ప్రతి సంవత్సరం కోట్ల రూపాయల్ని ఖర్చు చేస్తుంది. ఈ నిధులు దళితులకు చేరకుండా పోతున్నాయి. సంక్షేమ పథకాలు అమలు చేసే బాధ్యతను సాంఘిక సంక్షేమశాఖకు అప్పగించింది. ఈ శాఖ బాధ్యతలను చూస్తున్న అధికారులు, సిబ్బంది మాత్రం దళితుల సంక్షేమం కోసం విడుదలవుతున్న నిధుల్ని స్వాహా చేసేస్తుంటారు. ప్రభుత్వం సాంఘిక సంక్షేమశాఖకు అప్పగించిన బాధ్యతలు పూర్తిగా అమలు కాకుండా పోతున్నాయి. పేరుకే సాంఘిక సంక్షేమశాఖ వుంటుందన్న ఆరోపణలు వెల్లు వెత్తుతున్నాయి.

## బాధ్యతల విస్మరణ!

పట్టణ, గ్రామీణ ప్రాంతాలలో వివక్షత లేకుండా చర్యలు తీసుకోవడం, దళితులకు దేవాలయాల్లో ప్రవేశం కల్పించడం, టీ, టిఫిన్ దుకాణాల్లో రెండు గ్లాసుల పద్ధతికి స్వస్తిపలకడం, సాంఘిక దురాచారాలపై ప్రజలకు అవగాహన కల్పించడం, ఎస్సీ, ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టం గురించి వివరించడం తదితర కార్యక్రమాలు అమలు చేయాల్సి వుంటుంది. అయితే సాంఘిక సంక్షేమ శాఖ అధికారులు మాత్రం కేవలం హాస్టళ్ల నిర్వహణ, స్కాలర్‌షిప్పుల మంజూరుకే పరిమితమై పోయారు. పోనీ ఇవి కూడా సక్రమంగా అందిస్తున్నారా అనుకుంటే పొరపాటే ఇక్కడ కూడా అవినీతి, అక్రమాలకు పాల్పడడం ఈ కార్యాలయ ఉద్యోగులకు వెన్నతో పెట్టిన విద్య.

జిల్లా సాంఘిక సంక్షేమశాఖ పనితీరును పర్యవేక్షించేందుకు డిప్యూటి డైరెక్టర్‌ను ప్రభుత్వం నియమించింది. క్రిందిస్థాయిలో సాంఘిక సంక్షేమ అధికారి, సహాయ సాంఘిక సంక్షేమ అధికారులు వున్నారు. వీరందరూ నెల్లూరు నగరం, ఆత్మకూరు, గూడూరు, కావలి, కోవూరు, పొదలకూరు, సూళ్లూరుపేట, ఇందుకూరుపేట తదితర ప్రాంతాలలో విధులు నిర్వహిస్తున్నారు. వీరు నిత్యం హాస్టళ్లను సందర్శించి ప్రభుత్వ మార్గదర్శకాల ప్రకారం మెను అమలవుతుందా? లేదా? విద్యార్థుల ఉత్తీర్ణత శాతం ఎలా వుంది అన్న అంశాలను పరిశీలించాల్సి వుంటుంది. దీంతో పాటు ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల్లో చదివే ఎస్సీ విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు మంజూరు చేయాలి.

## అక్రమ ఒప్పందాలు

పాఠశాలలు, కళాశాలల నుంచి దరఖాస్తులు అందిన తర్వాత వాటిని సమగ్రంగా పరిశీలించి ఆ తర్వాత మంజూరుకు సిఫార్సు చేస్తూ జిల్లా కేంద్రానికి పంపాల్సి వుంటుంది. ప్రైవేటు కళాశాలల యాజమాన్యం నేరుగా ఈ శాఖ డిప్యూటి డైరెక్టర్‌తో ఒప్పందాలు చేసుకొని ఎటువంటి పరిశీలన లేకుండానే స్కాలర్‌షిప్పులు, ఇతర ఫీజులు మంజూరు చేయించుకుంటున్నారు. డిప్యూటి డైరెక్టర్‌గా వున్న సీతామహాలక్ష్మి మహిళ అయినప్పటికి అక్రమార్జనలో మగవాళ్లను మించిపోయింది. ఈమె బాధ్యతలు చేపట్టిన తర్వాత శాఖ మొత్తం భ్రష్టుపట్టిపోయింది. ఈమె అవినీతి, అక్రమాల గురించి ప్రశ్నించేవారు లేకపోవడంతో ఇష్టానుసారంగా వ్యవహరిస్తోంది.

హాస్టళ్ల నిర్వహణ దగ్గర నుంచి సిబ్బంది పదోన్నతులు, బదలీల వరకు లక్షలాది రూపాయలు వసూలు చేసింది. సాంఘిక సంక్షేమశాఖ ఆధ్వర్యంలో ఏర్పాటుచేసిన హాస్టళ్లలో వార్డెన్లు ఎంత నిర్లక్ష్యంగా వ్యవహరించినా ఈమె వారిపై ఎటువంటి చర్యలు తీసుకోలేదు. వార్డెన్ల నుంచి ప్రతి నెల క్రమం తప్పకుండా మామూళ్లు అందుతుంటాయి. మామూళ్లు వసూలు చేసే బాధ్యతను సహాయ సాంఘిక సంక్షేమశాఖ అధికారులు తీసుకున్నారు. హాస్టళ్లలో మెను ప్రకారం ఆహార పదార్థాలు పెట్టినా, పెట్టకపోయినా నెలసరి మామూళ్లు ముట్టజెప్పాల్సిందేనని కొందరు వార్డెన్లు వాపోతున్నారు.

## డి.డి. పై లెక్కలేనన్ని ఆరోపణలు

జిల్లా సాంఘిక సంక్షేమశాఖ డిప్యూటి డైరెక్టర్ సీతామహాలక్ష్మిపై విధినిర్వహణలో నిర్లక్ష్యం, మామూళ్ల వసూలు, సిబ్బంది పదోన్నతులు, బదలీల్లో అవినీతి అక్రమాలకు పాల్పడినట్లు అనేక ఆరోపణలు వున్నాయి. కొంతమంది దళిత సంఘాల నాయకులు ఆ శాఖ ఉన్నతాధికారులు, ప్రభుత్వానికి ఈమె అక్రమాల గురించి ఫిర్యాదులు కూడా చేశారు. కమిషనరేట్ నుంచి జాయింట్ డైరెక్టర్ నెల్లూరుకు విచ్చేసి డి.డిపై వచ్చిన అవినీతి ఆరోపణలపై విచారణ చేపట్టారు. అయితే ఈ విచారణపై కూడా అనేక అనుమానాలు తలెత్తాయి.

విచారణకు వచ్చిన జెడి ప్రభుత్వ అతిథి గృహంలోనూ, ఆ శాఖ కార్యాలయంలో బాధితులను పిలిపించి విచారణ చేయాల్సివుండగా నగరంలోని మూడు నక్షత్రాల హోటల్లో విచారణ జరపడం పలు విమర్శలకు దారి తీసింది. ఫిర్యాదు చేసిన వారికి ముందస్తు సమాచారం లేకుండానే ఏకపక్షంగా విచారణ ముగిసిపోయింది. ఇదిలావుండగా జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశం, డి.ఆర్.సి, జడ్పీ స్టాండింగ్ కమిటి సమావేశాలలో కూడా డిడి పనితీరుపై ఎమ్మెల్యేలు సైతం అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. హాస్టళ్ల పనితీరు దుర్భరంగా వున్నా వాటిని ఏ రోజు కూడా పరిశీలించిన దాఖలాలు లేవని మండిపడుతున్నారు. సాంఘిక సంక్షేమశాఖ ఆధ్వర్యంలో చేపట్టాల్సిన కార్యక్రమాలు, అమలు చేస్తున్న పథకాల గురించి కూడా సమావేశాలలో వెల్లడించలేకపోతు న్నారు. కేవలం స్కాలర్‌షిప్పులు, హాస్టళ్ల గురించి మాత్రమే రెండు పేజీల్లో వివరాలు నమోదు చేసి ప్రజాప్రతినిధులకు అందజేసి చేతులు దులుపుకొం టున్నారు. రాష్ట్ర ప్రభుత్వం మూడు నెలల క్రితం డిడి సీతామహాలక్ష్మిని జిల్లా నుంచి బదలీ చేయడం జరిగింది. జిల్లాలో రెండు చేతులా సంపాదన వుండడం, తక్కువ కాలంలో లక్షలు గడించడంతో జిల్లా నుంచి బదలీ అయ్యేందుకు ఆమె నిరాకరించింది.

రాష్ట్ర రాజధానిలో తిష్ట వేసి అధికారపార్టీకి చెందిన నేతల్ని, ఉన్నతాధికారులను కలసి మొత్తం మీద బదలీని రద్దు చేయించుకోగలిగింది. ఈమె వ్యవహార శైలిని చూస్తున్న ఇతర శాఖల అధికారులు ముక్కుమీద వేలేసుకుంటున్నారు. జిల్లా కలెక్టర్ అజమాయిషీ కూడా ఈ శాఖపై కొరవడింది. దీంతో ప్రజాప్రతినిధులు, ఎమ్మెల్యేలు పలుమార్లు డిడిపై ఆగ్రహం వ్యక్తంచేసినా ఈమె పనితీరులో మాత్రం మార్పు కానరావడం లేదు. ప్రభుత్వం ఈ శాఖకు విడుదల చేసిన నిధులు, ఖర్చుచేసిన నిధుల వివరాలు వెల్లడించేందుకు నిరాకరిస్తున్నారు. సాంఘిక సంక్షేమశాఖ అంటేనే భక్షించే శాఖగా పేరు గడించింది.

దళితుల సంక్షేమం కోసం పాటుపడాల్సిన ఈశాఖ దళితుల్ని మరింత వెనుకబడేందుకు సహకరిస్తుండడం గమనార్హం. గ్రామీణ ప్రాంతాల్లో దళితులపై దాడులు, మహిళలపై అత్యాచారాలు జరిగిన సమయంలో కూడా డి.డి ఆయా ప్రాంతాలకు వెళ్లి బాధితుల్ని పరామర్శించరు. ప్రభుత్వం నుంచి ఒత్తిడి వస్తేనో, లేకుంటే దళిత సంఘాలు ఆందోళన చేస్తే గాని పల్లెమొఖం చూడరు. ఇటీవల కార్పొరేట్ కళాశాల్లో ప్రవేశం కోసం నిర్వహించిన కౌన్సిలింగ్ సమయంలో డి.డి అక్రమాలకు పాల్పడ్డారన్న ఆరోపణలు వున్నాయి. కౌన్సిలింగ్ సమయంలో ఒరిజినల్ సర్టిఫికేట్లు తీసుకు రాలేదన్న ఒక్క కారణంతో సుధీర్ అనే విద్యార్థికి సీటు కేటాయించ లేదు.

ఈ విద్యార్థికంటే తక్కువ మార్కులు వచ్చిన మరో విద్యార్థి తల్లిదండ్రుల నుంచి కొంత నగదు వసూలు చేసుకొని సీటు కేటాయించడం వివాదాస్పదంగా మారింది. దీంతో ఆవేదన చెందిన సుధీర్ డి.డి కార్యాలయానికి వెళ్లి ప్రాధేయపడితే దయ చూపడం మాని 3వ నగర పోలీస్‌స్టేషన్‌లో విద్యార్థిపై కేసు నమోదు చేయించి దళితులకు వ్యతిరేకంగా మారింది. విద్యార్థిపై కేసు నమోదు చేయించడంపై దళిత సంఘాలు ఆందోళన కూడా చేపట్టడం జరిగింది. విధి నిర్వహణ పట్ల నిర్లక్ష్యం, ధనార్జనే ధ్యేయంగా పెట్టుకున్న డిడిపై ప్రభుత్వం స్పందించి చర్యలు తీసుకోకపోతే ప్రజల ఆగ్రహానికి గురికావాల్సి వుంటుంది. ◆J



నెల్లూరు ట్రాఫిక్ కానిస్టేబుల్, మూలపేట రామయ్య బడి పూర్వ విద్యార్థి సతీష్‌కుమార్ ఈ స్కూల్‌లో ఈ యేదాది టెన్త్ చదివి అత్యధిక మార్కులు తెచ్చుకొన్న విద్యార్థి మునిశంకర్‌కు ఇంటర్ టెక్స్ట్, నోట్ బుక్స్ అందజేస్తున్న దృశ్యం.

# గూడూరు పెద్ద చెరువును దురాక్రమిస్తున్నారు!

## నీటి సంఘం అధ్యక్షుడు సహకరిస్తున్నాడు

గూడూరులో పెద్ద చెరువుగా పిలువబడే 1040ఎకరాల ఆయకట్టు గల గూడూరు చెరువు ఆక్రమణలతో కుంచించుకుపోయింది. నానాటికి చెరువు ఆయకట్టు తరిగిపోతుండడంతో దాదాపు 100 ఎకరాలకు సేద్యపునీరు అందని పరిస్థితి ఏర్పడడంతో పంటలు పండించుకోలేకపోతున్నామని రైతులు వాపోతున్నారు. పట్టణానికి చెందిన కొందరు ధనవంతులు 40 ఎకరాల మేర ఆక్రమించేశారు. రోడ్లు, కాలనీలు, వ్యాపార సముదాయాలు పెరిగిపోవడంతో ప్రస్తుతం చెరువు ఆయకట్టు 800 ఎకరాలకు చేరుకొన్నట్లు సమాచారం. ఈ కారణంగా తూముల క్రింద నాలుగు అడుగుల లోతు వుండాల్సిన నీళ్ల ప్రస్తుతం అడుగంటిపోయాయి. చెరువుకు పడమట వైపున ఆక్రమణదారులు కొందరు ఇళ్లు నిర్మించి వేశారు. ఆస్పత్రి వైపున వుండే చెరువు నుంచి నీళ్ల ప్రవహించే కలుజు దాదాపు పూడిపోయింది. లోతట్టువైపున పెద్దభవనాలు వెలసి వున్నాయి. చివరకు చెరువు ఆక్రమణలకు గురికాకుండా వుండేందుకు 3లక్షల రూపాయలతో ఏర్పాటుచేసిన స్ట్రెంచ్‌ను కొందరు ప్రొక్లెయిన్‌లతో పూడ్చివేసి మరీ ఆక్రమణలకు పాల్పడుతున్నా అడిగే నాధుడే లేకుండాపోయారు. ఒకనాడు పట్టణ ప్రజల దాహార్తిని తీర్చేందుకు చెరువు మధ్యలో ఏర్పాటు చేసిన బావి ప్రస్తుతం ఆక్రమణల మధ్య బందీగా వుంది. ఈ ఆక్రమణల వెనుక ఆ చెరువు నీటి సంఘం అధ్యక్షుడే వున్నట్లు సమాచారం. ఇప్పటికైనా సంబంధిత శాఖాధికారులు చెరువును ఆక్రమణల బారి నుంచి రక్షించాలని ప్రజలు కోరుకొంటున్నారు.

# శ్లాబ్ కూలి విద్యార్థులకు గాయాలు!

- బయటపడ్డ ప్రభుత్వ స్కూళ్లలోని డొల్లతనం



దగదర్తి జిల్లా పరిషత్ పాఠశాలలోని తరగతి గదిలో సీలింగ్ పెచ్చులూడి బల్లలపై పడివున్న దృశ్యం. ఇన్‌సెట్‌లో దెబ్బతిన్న సీలింగ్.

జిల్లాలో పలు ప్రభుత్వ పాఠశాలలు శిథిలావస్థకు చేరుకొని వుండడం తెలిసిందే. ఎప్పుడు కూలుతాయో తెలియక విద్యార్థులు భయాందోళనల మధ్య కాలం గడపాల్సిన పరిస్థితులు నెలకొన్న నేపథ్యంలో దగదర్తి జిల్లాపరిషత్ పాఠశాలలో అనుకొన్నంతా జరిగింది. శిథిలమై వున్న ఈ పాఠశాలలో ఇటీవల విద్యార్థులు తరగతి గదుల్లో యూనిట్ టెస్టులు వ్రాస్తుండగా ఒక్కసారిగా శ్లాబ్ పెచ్చులూడి మీద పడడంతో విద్యార్థులు భయభ్రాంతులకు గురై పరుగులు తీశారు. శ్లాబ్ పెచ్చులు పైన పడడంతో అక్కడ వున్న విద్యార్థులకు తీవ్రగాయాలయ్యాయి. పరుగులు తీసే సందర్భంలో ఒకరిపై ఒకరు పడడం వలన తొక్కిడికి గురై మరికొంత మంది గాయపడ్డారు. బాలమురళి అనే విద్యార్థికి తల, కంటిపై పెద్ద గాయాలయ్యాయి. ఈ సంగతి తెలిసిన వెంటనే విద్యార్థుల తల్లిదండ్రులు, గ్రామస్తులు ఉలిక్కిపడి పాఠశాల వద్దకు పరుగులు తీశారు. 108కు సమాచారం అందించడంతో గాయపడిన విద్యార్థులకు చికిత్స అందించేందుకు ప్రభుత్వ వైద్యశాలకు తరలించారు. 1984లో నిర్మించిన ఈ పాఠశాలకు పలుమార్లు మరమ్మత్తులు చేసినా నాసిరకం నిర్మాణం కావడం వల్ల తరచూ శ్లాబ్ పెచ్చులూడుతున్నట్లు సమాచారం. విషయం తెలుసుకొన్న ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, ఎంపిడిఓ, తహశీల్దార్, డిప్యూటి డిఇఓ తదితరులు పాఠశాలను సందర్శించారు.

# ఉపాధిహామీ నిధులను మింగిన ఉదయగిరి!

## 17 పంచాయితీల్లో వెలుగుచూసిన కుంభకోణం

ఉదయగిరిలో ఉపాధిహామీ పనుల్లో అక్రమాలకు అంతేలేకుండా పోయింది. ఎన్ని సామాజిక తనిఖీలు జరిగినా, రాష్ట్ర విజిలెన్సు అధికారులు వచ్చినా అక్రమాలు ఆగడం లేదు. మండలంలోని 17 పంచాయితీల్లో అక్రమాలు వెలుగు చూస్తూనే వున్నాయి. క్షేత్ర సహాయకులు ఈ అక్రమాలకు పాల్పడుతుండడంతో పెద్ద ఎత్తున అవినీతి జరుగుతోంది. పనులకు వెళ్లే కూలీల సంఖ్యను కంప్యూటరీకరణ చేసే సమయంలో అధికంగా చూపడం, బినామీ పేర్లతో కూలీల సంతకాలు, వేలిముద్రలు క్షేత్ర సహాయకులే వేసేస్తారు. మస్టర్ రోల్స్ వెరిఫికేషన్ అధికారులు సంతకాలు చేసేస్తుండడంతో అవినీతి సొమ్ములో వీరికి భాగాలు అందుతున్నాయి. పుల్లాయపల్లి, కృష్ణంపల్లెలో బినామీ మస్టర్లతో లక్షల రూపాయలు దిగమింగినట్లు అధికారుల విచారణలో వెల్లడైంది. ఇంకా ఆశ్చర్యపడే విషయం ఏమిటంటే ఉదయగిరి మండలంలో 17 పంచాయితీలకుగాను 9,725 కుటుంబాలకు జాబ్ కార్డులు పంపిణీ చేశారు. అందులో 24,518 మందికి ఉపాధి చూపుతున్నట్లు లెక్కలు వ్రాశారు. మండలంలో మొత్తం ఓటర్ల సంఖ్య 26వేల మంది అంటే దాదాపు ఓటర్లందరికి ఉపాధి కల్పించినట్లు తప్పుడు లెక్కలు వ్రాసేశారు. ఈ అక్రమాల ఫలితంగా అసలైన కూలీలకు పని లేక పస్తులుండాల్సి వస్తోంది.

# శిథిలావస్థలో హాస్టళ్లు!

## బోగోలు మండల విద్యార్థుల కష్టాలు

బోగోలు మండలం విశ్వనాథరావుపేటలో గల ఎస్సీ హాస్టళ్లు శిథిలావస్థకు చేరుకొన్నాయి. ఈ ప్రాంతంలో గల బాల, బాలికల హాస్టళ్లలో పరిస్థితి ఘోరంగా వుంది. శిథిలావస్థకు చేరుకున్న భవనం ఎప్పుడు కూలుతుందో తెలియక విద్యార్థులు భయం భయంగా కాలం వెళ్లదీయాల్సి వస్తోంది. పైకప్పు పెచ్చులూడి ప్రమాదకరంగా వుంది. వర్షం వస్తే అంతా ఉరుపే. హాస్టళ్ల చుట్టూ ప్రహరీగోడలు లేకపోవడంతో పందుల సంచారం అధికంగా వుంది. హాస్టళ్లలో ఎక్కడ చూసినా అపరిశుభ్రత కొట్టొచ్చినట్లు కన్పడుతోంది. తలుపులు, కిటికీలు లేవు. చివరకు మరుగుదొడ్లకు తలుపులు లేకపోవడంతో హాస్టల్‌లో వుండే బాలికలు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తున్నది. త్రాగునీటికీ ఇబ్బందులు తప్పడం లేదు. ఒకప్పుడు 450 నుంచి 510 మంది విద్యార్థినీ, విద్యార్థులతో వుండిన హాస్టళ్ల నేడు 70 మందికి మాత్రమే పరిమితమయ్యాయి. దీనికి కారణం శిథిలమైన హాస్టళ్లలో తమ పిల్లలను వుంచేందుకు వారి తల్లిదండ్రులు ఇష్టపడకపోవడమే. ఇప్పటికైనా హాస్టల్ విద్యార్థుల సమస్యలను దృష్టిలో వుంచుకొని కనీస సౌకర్యాలు కల్పించాలని చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు కోరుకొంటున్నారు.

# విత్తనాల పంపిణీని అడ్డుకొన్న రైతులు!

## కలువాయిలో గొడవ

వ్యవసాయ అధికారుల తీరును నిరసిస్తూ కలువాయిలో రైతులు విత్తన పంపిణీని అడ్డుకొన్నారు. సబ్సిడీకి విత్తనాలను అందజేసేందుకు అధికారులు సిద్ధం అయ్యారు. ఈ సందర్భంగా పట్టాదారు పాసుపుస్తకంలో ఫోటో వున్న రైతు వస్తేనే విత్తనాలు ఇస్తామని, ఇతరులు వస్తే ఇచ్చేదిలేదన్నారు. దీనిపై రైతులు అధికారులతో గొడవకు దిగారు. రైతు కాకపోయినా కుటుంబ సభ్యులు వచ్చినా విత్తనాలు అందజేయాలని రైతులు డిమాండ్ చేశారు. దీనికి అధికారులు ఒప్పుకోకపోవడంతో రైతులు విత్తనాలు పంపిణీని అడ్డుకొన్నారు. చివరకు పెద్దలు జోక్యం చేసుకొని ఇరుపక్షాలకు సర్దిచెప్పడంతో విత్తనాల పంపిణీ జరిగింది. ఈ సందర్భంగా 50 శాతం సబ్సిడీపై జీలగ, జనుము, కందులు పంపిణీ చేశారు. వేరుశనగ విత్తనాలను అందించారు.

## గోడౌన్ల నిర్మాణానికి నిధులు!

రైతులు వ్యవసాయ గోడౌన్లు నిర్మించేందుకు బ్యాంకర్లు విరివిగా రుణాలివ్వాలని జిల్లా లీడ్‌బ్యాంక్ మేనేజర్ సంపత్ కుమార్ సూచించారు. ఉదయగిరి మండల పరిషత్ కార్యాలయంలో జరిగిన బ్యాంకర్ల సమావేశంలో ఆయన పాల్గొన్నారు. రైతులు పండించిన పంటలకు గిట్టుబాటు ధర లభించనప్పుడు ధ్యాన్యం నిల్వ చేసుకొనేందుకు గిడ్డంగులు లేక తీవ్ర ఇబ్బందులు పడు

### లీడ్ బ్యాంక్ మేనేజర్ వెల్లడి

తున్నారన్నారు. గోడౌన్ల నిర్మాణానికి నాబార్డు 25శాతం రాయితీ ఇస్తుందన్నారు. రైతులు 25శాతం చెల్లించాలని, బ్యాంకర్లు 50 శాతం అందజేస్తారన్నారు. ఇందులో ఎస్సీ, ఎస్టీలకు, మహిళలకు 33శాతం రాయితీ వర్తిస్తుందన్నారు. జిల్లాలో ఒక్కసీజన్‌లో 7.50లక్షల టన్నుల వరిపంట దిగుబడి అవుతున్నదన్నారు. దీనిని దృష్టిలో పెట్టుకొని విరివిగా రైతులకు రుణాలివ్వాలని, కౌలుదార్లకు రుణాలు అందించేందుకు బ్యాంకులు కృషి చేయాలన్నారు. ప్రతి నెల తప్పని సరిగా సిబిఆర్ సమావేశం ఏర్పాటు చేసి రికవరీలపై చర్చించాలని కోరారు.

## సెలవుపై బాలాయపల్లి ఎంపిడిఓ!

**● ఎమ్మెల్యేపై తొందరపడి కేసుపెట్టిన ఫలితం**

బాలాయపల్లి ఎంపిడిఓ వెంటకశేషయ్య దీర్ఘకాలిక సెలవుపై వెళ్లడం చర్చనీయాంశమయ్యింది. ఇటీవల ప్రజాపథం సందర్భంగా ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణకు, ఎంపిడిఓకు మధ్య వివాదం రేగింది. ప్రజలకు సేవ చేయలేని అధికారులను చెట్టుకు కట్టేసి కొట్టాలని రామకృష్ణ వ్యాఖ్యానించడంతో వివాదం రేగింది. ఆరోజు గమ్మునగా వున్న ఎంపిడిఓ, ఇతర అధికారుల ఒత్తిడి మేరకు ఎమ్మెల్యేపై పోలీస్‌స్టేషన్‌లో కేసు పెట్టారు. దీనికి ప్రతిగా కురుగొండ్ల అనుచరులు ఎంపిడిఓపై ఎస్సీ, ఎస్టీ కేసు పెట్టారు. ఈ నేపథ్యంలో స్థానిక ఎమ్మెల్యేతో గొడవ పెట్టుకోవడమే కాకుండా ఏకంగా కేసు పెట్టడంతో వెంకటశేషయ్యకు విధి నిర్వహణలో ఇబ్బందులు, రాజకీయ ఒత్తిళ్లు ఎదురౌతున్నాయి. తొందరపడి ప్రజాప్రతినిధిపై కేసు పెట్టడం వల్ల ఎలాంటి తలనొప్పులు ఎదురౌతాయో అనుభవ పూర్వకంగా ఎదురైంది. ఈ పరిస్థితులలో దీర్ఘకాలిక సెలవుపై వెళ్లడమే ఉత్తమమనే నిర్ణయానికి వచ్చిన ఎంపిడిఓ ఆ పని చేసినట్లు సమాచారం. ఆయన స్థానంలో కార్యాలయ సూపరింటెండెంట్ కోటేశ్వరరావును ఇన్‌చార్జి ఎంపిడిఓగా నియమించారు.

## జెన్‌కో అధికారులపై ఆదాల ఆగ్రహం

స్థానికులకు ఉద్యోగాలు ఇవ్వలేని పరిశ్రమలు, ప్రాజెక్టులు వ్యర్థం అని సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి వ్యాఖ్యానించారు. ముత్తుకూరు మండలం నేలటూరులో జెన్‌కో విద్యుత్ ప్రాజెక్టు కార్యాలయానికి విచ్చేసిన ఆయన స్థానికుల సమస్యలను అడిగి తెలుసుకొన్నారు. ఈ సందర్భంగా వారు తమ గోడు వెళ్లబోసుకొన్నారు. దీనికి తీవ్రంగా స్పందించిన ఆదాల నియోజకవర్గంలో పేదలకు, స్థానికులకు ఉపయోగ పడలేని పరిశ్రమలు దేనికని ఆగ్రహించారు. యాజమాన్యాలు లబ్దికోసం రైతుల వద్ద నుంచి భూములు లాక్కొని వారికి అన్యాయం చేస్తే ఊరుకోమన్నారు. ప్రాజెక్టుల నుంచి వచ్చే బూడిదను నెత్తినేసుకొనేందుకు స్థానికులు సిద్ధంగా లేరని మండిపడ్డారు. నేలటూరులో మంచినీటి పథకం ఏర్పాటు చేస్తామని హామీ ఇచ్చి ఆ హామీని నిలబెట్టుకోలేకపోయారని అసంతృప్తి వ్యక్తం చేశారు. ఆదాల ఆగ్రహం చూసి జెన్‌కో అధికారులు నచ్చజెప్పే ప్రయత్నం చేసినప్పటికీ ఆయన ఒప్పుకోలేదు. నేలటూరులో రోడ్లు, మంచినీరు అందించాలని స్థానికులకు ఉద్యోగవకాశాలు కల్పించాలని ఆదేశించారు.



నెల్లూరు రమేష్‌రెడ్డి నగర్‌లోని ఆర్‌సిఎం ఎయిడెడ్ స్కూల్‌లోని పిల్లలకు నెల్లూరుజిల్లా పవన్ కళ్యాణ్ ఫ్యాన్స్ తరపున పుస్తకాలు, పలకలు పంచుతున్న ఫాదర్ హృదయరాజ్, టోని తదితరులు.



నెల్లూరులో హమాలీల సైకిల్ జాతాను ప్రారంభిస్తున్న సిఐటియు అధ్యక్షుడు ఎస్.మురళీకృష్ణ. ప్రక్కన సిపిఎం నేతలు అజయ్‌కుమార్, మోహన్‌రావు.

## పేరుకే ప్రభుత్వాస్పత్రి!

**ప్రథమ చికిత్సకు గతిలేని ఆత్మకూరు దవాఖానా!**

ఆత్మకూరు పట్టణంలో ఏర్పాటు చేసిన ప్రభుత్వ ఆసుపత్రి ప్రజలకు ఉపయోగపడడం లేదు. చిన్న చిన్న ప్రమాదాలు జరిగినప్పుడు, రోగాలబారిన పడినప్పుడు కనీసం ప్రథమ చికిత్స చేసే దిక్కు కూడా లేకుండా పోయింది. డబ్బులు పెట్టి ప్రైవేట్ ఆస్పత్రిలో చికిత్స చేయించుకోలేని పేదలకు ప్రభుత్వ ఆస్పత్రే దిక్కు. కానీ ఆస్పత్రిలో మాత్రం వైద్య సేవలు అందడం లేదు. దీంతో పేదలు ఇక్కడ వైద్యం అందక, బయటకు వెళ్లి వైద్యం చేయించుకోలేక అల్లాడిపోతున్నారు. ఆస్పత్రిలో పేరుకు అంబులెన్సు వున్నా అది కదలదు. ఒకవేళ అంబులెన్స్ రావాలంటే రోగులే ఇంధనం ఖర్చులు భరాయించాల్సి వస్తుంది. అత్యవసర పరిస్థితుల్లో ఆక్సిజన్ లేకపోవడంతో పలువురు ప్రాణాలు పోగొట్టుకొన్న ఘటనలు వున్నాయి. ఆస్పత్రికి వచ్చే మందులు, చివరకు కుక్కకాటుకు చేసే ఇంజక్షన్లు సైతం బయటి మందుల షాపుల్లో అమ్మేస్తున్నారు. ఆధారాలతో సహా ఈ మందులు బయటపడ్డా పట్టించుకొనే వారే లేకుండా పోయారు. మరోవైపు నెల్లూరు – ముంబాయి రహదారిపై తరచూ ప్రమాదాలు జరుగుతున్నా అత్యవసర వేళల్లో చికిత్స అందించలేక పోతుంది ఈ ఆసుపత్రి. చివరకు ప్రమాదాల్లో మృతి చెందిన శవాలకు పోస్టుమార్టం చేసే దిక్కు కూడా లేకుండాపోయింది.

**● కావలి ఆర్డీఓ ఆఫీసులో**

## దొంగలు పడ్డారు!

కావలి పట్టణంలోని ఆర్‌డిఓ కార్యాలయంలో ఇటీవల జరిగిన దొంగతనం పలు అనుమానాలకు తావిస్తోంది. తెల్లవారుజామున కొందరు గుర్తు తెలియని వ్యక్తులు వచ్చి వాచ్‌మెన్ సుధాకర్‌పై దాడిచేసి ఆఫీసు తాళాలు పగులగొట్టి లోనికి ప్రవేశించారు. ఈ సందర్భంగా వాళ్లు కార్యాలయంలో పనిచేసే సుకుమార్, శ్రీనివాస్, హమీద్ సీట్లు ఎక్కడని అడిగారని వాచ్‌మెన్ చెప్తున్నారు. ఆ ప్రకారం ఉద్యోగుల టేబుళ్ల వద్దకు వెళ్లి ఆగంతుకులు ఎన్‌హెచ్–5కు సంబంధించిన ఫైళ్లు వుండే గది తలుపులు

### సిబ్బంది సహకారంపై సందేహాలు!

పగులగొట్టే యత్నం చేసి పరారయ్యారని వాచ్‌మెన్ చెప్తున్న కథనం. పోలీస్ విచారణలో మాత్రం వాచ్‌మెన్ ఒక్కో కథ విన్పిస్తుండడం పలు అనుమానాలకు తావిస్తోంది. కార్యాలయంలో ఎలాంటి ఫైళ్లు పోలేదని ఆర్‌డిఓ చెప్తుండగా, కొన్ని ఫైళ్లలో ముఖ్యమైన కాగితాలు కన్పించడంలేదని తెలుస్తోంది. దీనిపై స్పష్టమైన సమాచారాన్ని పోలీసులు కూడా చెప్పలేకపోతున్నారు. 6 నెలల క్రిందట రిజిస్ట్రార్ ఆఫీసులో కూడా దొంగతనం జరిగింది. అప్పుడు కొన్ని స్టాంపులు దొంగిలించుకపోయినట్లు బయటపడింది. కానీ ఇప్పటివరకు దొంగల్ని కానీ, దొంగతనానికి గురైన స్టాంపులను కనుగొనలేకపోయిన పోలీసులకు ఆర్‌డిఓ కార్యాలయంలో దొంగతనంతో మరొక చిక్కొచ్చిపడింది. కార్యాలయాలను ఆనుకొని సిఐ ఆఫీసు వున్నా దొంగలకు భయం లేకుండా పోయింది.

**● అమ్మో...**

## ఆత్మకూరు డిప్యూటీ తహశీల్దార్!

**తను పుట్టిన తేదీనే మార్చి విధుల్లో కొనసాగింది**

ఆత్మకూరు మండల తహశీల్దార్ కార్యాలయంలో డిప్యూటి తహశీల్దార్‌గా పని చేసే ఉద్యోగిని పుట్టిన తేదీని దిద్ది ఏడాదిగా విధుల్లో కొనసాగుతున్న వైనం బయటపడింది. ఆమె తన పుట్టిన సంవత్సరం 1951ని 59గా మార్చి గుట్టుచప్పుడు కాకుండా ఉద్యోగం చేస్తున్న వైనాన్ని కార్యాలయ సీనియర్ అసిస్టెంట్లు బట్టబయలు చేశారు. తహశీల్దార్ కార్యాలయంలో డ్రాయింగ్ ఆఫీసర్‌గా వుంటూ అందరి జీతాలు డ్రా చేసి ఇచ్చే అధికారిణి తాను మాత్రం అక్రమాలకు పాల్పడి దొరికిపోవడం సంచలనం కల్గించింది. ఏడాది క్రిందటే ఉద్యోగ విరమణ చేయాల్సి వుండగా ఇంకా కొనసాగుతూ ఆత్మకూరు తహశీల్దార్ కావాలని కలలుకంది. ఒకవేళ ఇది బట్టబయలైనా అక్రమాన్ని కప్పిపుచ్చుకొనేందుకుగాను ఏడాదిగా జీతం తీసుకోకుండా వుందట. కొందరు కార్యాలయ సిబ్బంది అనుమానించి కలెక్టరేట్‌లో ఆమె జనన ధృవీకరణ పత్రాన్ని, ఇతర వివరాలను బయట పెట్టడంతో నిద్రమేల్కొన్న ఉన్నతాధికారులు ఆగమేఘాలపై ఆమెను ఉద్యోగ విరమణ చేయించారు. ఎవరు రిటైర్ కాబోతున్నారు, ఎందుకు విధుల్లో కొనసాగుతున్నది తెలుసుకోలేని స్థితిలో సంబంధిత శాఖ అధికారులు వుండడం సిగ్గుచేటు.

## తేలు కుట్టిన దొంగలు




దొంగలు తేలు కుట్టినా సహించి ఊరుకొంటారన్నది సామెత. అందుకే ఆర్యులు తేలు కుట్టిన దొంగని వాఖ్యానిస్తుంటారు. దీన్ని పోలినట్లుంది నగరంలో కొందరు ధనవంతుల పరిస్థితి. ఇటీవల నెల్లూరులో పలువురు పెద్దల ఇళ్లలో చోరీలు జరిగాయి. దొంగలు పెద్ద మొత్తంలో డబ్బులు, నగదు దోచుకెళ్లారు. విషయం బహిరంగమయ్యాక పోలీసులకు మాత్రం తక్కువ మొత్తంలో డబ్బులు, నగలు పోయాయని వీరు చెప్తున్నారు. అసలు విషయం చెబితే ఇన్‌కంటాక్స్ అధికారులతో తలనొప్పులు తప్పవని పాపం ఇళ్లలో దొంగలు పడ్డా తేలుకుట్టిన దొంగలయ్యారు.

## అమ్మో... ఆమని!




శుభలగ్నం సినిమాలో డబ్బు కోసం భర్త జగపతిబాబును అమ్మేసినట్లు నటి ఆమని నిజజీవితంలోనూ ఆమె సోదరుని కుటుంబంలో కలతలు రేపింది. డబ్బు కోసం సోదరునికి రెండు పెళ్లిళ్లు చేసింది. మొదటి భార్య నెల్లూరు అమ్మాయి లీలావతిని ఆమె సోదరుడు శ్రీనివాస్ అక్క మాట విని తీవ్ర వేధింపులకు గురి చెయ్యడంతో ఆమె పోలీసులను ఆశ్రయించింది. పోలీసులు ఆమని మినహా ఆమె కుటుంబ సభ్యులను శ్రీకృష్ణ జన్మస్థలంలో రెండు రోజులు వుండేలా చేశారు. ఆమని మాత్రం తెలివిగా యాంటిసిపేటరీ బెయిల్ తీసుకొని తప్పించుకొంది. సోదరుని కుటుంబంలో కలతలు రేపిన 'ఆమని' మొత్తం మీద సింహపురిలో గబ్బు పట్టింది.

## ఖంగుతిన్న విద్యార్థి నేతలు!



తనపనేదో తాను చేసుకపోయే సాత్వికునిగా పేరుగాంచిన జిల్లా కలెక్టర్ రాంగోపాల్‌కు ఈ మధ్య మాటిమాటికి కోపమొస్తోంది. ఆ సమయంలో ఆయన నోరు జారేస్తున్నారు. ఇటీవల విద్యార్థుల సమస్యలపై పోరాడుతున్న విద్యార్థి సంఘాలు వాళ్లను రోడ్లపైకి తీసుకరావడం కలెక్టర్ గారికి నచ్చడం లేదు. ఈ వారంలో ఓ సమస్యపై నగరంలో ప్రదర్శన చేసి వినతిపత్రం ఇవ్వను వెళ్లిన విద్యార్థి సంఘ నేతలపై ఆయన కన్నెర్ర చేశారు. మరొకసారి సమస్యల పేరుతో విద్యార్థులను రోడ్లపై తిప్పితే ఊరుకోను... మిమ్మల్ని ముందు లోపల వేయిస్తాననే సరికి వారు ఖంగుతిన్నారు. ఆ తర్వాత కలెక్టర్ వైఖరిని నిరసిస్తూ పత్రికా విలేకరుల సమావేశాలు పెట్టారు. విద్యార్థులు వీధినపడకుండా సమస్యలు పరిష్కరించేలా 'కలెక్టర్' అధికారులను కసురుకొంటే బాగుంటుందని అభిప్రాయపడ్డారు. కలెక్టర్‌గారికి రుచించకపోయినా ఇది కరెక్ట్ మాటే కదూ...!

## మొబైల్ మోసం!



సర్వం సెల్లు మయం అయ్యింది నేడు. నడుస్తున్నా, పని చేస్తున్నా, ప్రయాణిస్తున్నా, తింటున్నా సరే సెల్‌ఫోన్‌లో మాట్లాడుతున్నారు జనం. సెల్‌ఫోన్‌కు జనం బానిసలవ్వడంతో రకరకాల మెసేజ్‌లతో జనాన్ని బలహీనపర్చి దోచుకొంటున్నారు. ఫ్రెండ్‌షిప్ పేరుతో కొందరు సెల్‌లో మెసేజ్‌లు పంపి ఆ తర్వాత సెక్సీ కబుర్లలో దింపుతున్నారు. ఈ మైకంలో వుండగానే కొంత మొత్తాలు తమ బ్యాంకుల ఖాతాల్లో వేయించేలా చేస్తున్నారు. కాల్ కట్ అయ్యాక గాని తాము మోసపోయామన్న విషయం తెలుసుకోలేక పోతున్నారు సెల్లు ప్రియులు. నెల్లూరులో ఈ తరహా మోసాలు ఎక్కువయ్యాయన్నది టాక్ ఆఫ్ ది ట్రంకురోడ్డు.

## గరుడ విజయానికి చిహ్నామే గరుడ పంచమి!



శ్రావణ శుక్ల పంచమిని గరుడ పంచమిగా జరుపుకొంటారు. పక్షీంద్రుడు అయినటువంటి గరుడుడు శ్రీమహావిష్ణువు వాహనం. నాగాంతకుడైన గరుత్మంతుడిని పంచమినాడు పూజిస్తే సకల శుభాలు కల్గుతాయని నమ్మకం. అందుకే ఈ పంచమికి గరుడ పంచమని పేరు. దీనినే నాగుల పంచమని కూడా అంటారు. ఆగస్టు 14తేది వచ్చే పంచమి నాడు దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా పూజలు చేస్తారు.

తల్లీబిడ్డల అనురాగానికి, భక్తి భావనకు గరుడ పంచమి, నాగుల పంచమి పూజలే నిదర్శనం. వివిధ ఆలయాలలో ద్వారపాలకుడిగా, వైకుంఠవాసుడు నారాయణుడికి వాహనంగా వుండే గరుత్మంతుడు తల త్రివృత్త సమానం అని, యజుర్వేదం అని, చేతులు, పాదాలు గాయత్రి ఛందస్సు అని, శరీరం వేదదేహమని, రెక్కలు బృహత్సమాదులని వేద ధర్మానుసారంగా వర్ణిస్తారు. వాయువుకు సంబంధించి ప్రాణ, అపాన, ధ్యాస సమానాదులు గరుత్మంతుడి నియంత్రణలో వుంటాయని పురాణ కథనం.

మహిళలు తమ పిల్లల జ్ఞానం, అభివృద్ధి, ధైర్యం కోసం గరుడపంచమినాడు పూజలు చేస్తారు. నూతన వధూవరులు భావిజీవితం సర్వ సౌభాగ్యాలతో విలసిల్లాలని పంచమి వ్రతాన్ని పాటిస్తారు. దీనికి సంబంధించి ఒక కథ వుంది. సప్త రుషుల్లో ఒకరైన కశ్యపమహామునికి వినతి, కద్రువ అనే ఇరువురు భార్యలు. వీరు ఒకనాడు వ్యాహ్యాళికి వెళ్లగా ఇంద్రుని ఉచ్ఛైశ్రవం అనే తెల్లని గుర్రం కన్పిస్తుంది. గుర్రం ఎంత తెల్లగా వుందో అని వినతి, గుర్రంతోక నల్లగా వుందని కద్రువ అంటారు. ఈ సందర్భంగా ఇద్దరు పందానికి దిగుతారు. గుర్రాన్ని పూర్తిగా తెల్లగా మారిస్తే వినతి వద్ద కద్రువ దాసీగా వుండేలా, తోక నల్లగా వుంటే కద్రువ వద్ద వినతి దాసీగా వుండేలా ఒప్పందానికి వస్తారు. కద్రువ దుర్భుద్ధితో జయించదలచి తన కుమారులైన శేషు, వాసుకి, తక్షక, కర్కోటకుడుని సహాయం చేయమనగా శేషు, వాసుకి అందుకు ఒప్పుకోకపోవడంతో తల్లి శపిస్తుంది. కర్కోటకుడు మాత్రం కద్రువ చెప్పినట్లుగా గుర్రం తోకలో చేరి తల్లిని గెలిపించి వినతిని దాసిగా మారుస్తాడు.

వినతి కుమారుడైన గరుత్మంతుడు తన తల్లిని దాస్య చెర నుంచి విడిపించేందుకు ఏమి చేయాలని నాగులను అడుగగా అమృతం తెచ్చివ్వమంటారు. దాస్య శృంఖలాలు తెంచడం కోసం గరుడుడు స్వర్గానికి వెళ్లి అమృత భాండం తెచ్చిస్తాడు. తల్లి ప్రేమ కోసం దేవతలను ఎదిరించిన గరుడ విజయానికి చిహ్నంగా గరుడ పంచమిని, నాగుల నుంచి రక్షణ పొందేందుకు, నాగ దోషం కలుగకుండా పిల్లలను కాపాడుకొనేందుకు నాగ పంచమి పూజ చేస్తారు. పశ్చిమ బెంగాల్, అస్సాం, ఒరిస్సాలో మానసదేవికి పూజలు వైభవంగా జరపడం ఆనవాయితీ.

## 'సారా' సమారియా ఔట్!



రాష్ట్రంలో ప్రతి వెయ్యి మందికి ఓ బార్ ఏర్పాటు అంటూ కొత్త ఎక్సైజ్ విధానాన్ని రూపకల్పన చేసిన ఎక్సైజ్ కమిషనర్ హీరాలాల్ సమారియాకు బదలీ వేటు తప్పేట్లు లేదు. కొత్త ఎక్సైజ్ విధానం వల్ల రాష్ట్రంలో బ్రాందీ షాపులు, బార్ల సంఖ్య పెద్దగా పెరగకపోయినా రాష్ట్ర ప్రభుత్వం మాత్రం నవ్వులపాలైంది. ఎక్సైజ్ విధానం పట్ల ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత వ్యక్తమవుతోంది. ముఖ్యంగా మహిళలు దీనిపై మండిపడుతున్నారు. విషయం తెలుసుకొన్న రోశయ్య దీన్ని చల్లార్చడానికి స్వయంగా రంగంలోకి దిగాడు. ఎక్సైజ్ శాఖ కమిషనర్‌ను, ఆ శాఖ ముఖ్యకార్యదర్శిని పిలిపించుకొని చెడామడా తిట్టాడట. అయితే దీనికి సంబంధించిన జీవోపై తమరే సంతకం పెట్టారంటూ సదరు అధికారులు రోశయ్య దృష్టికి తేగా ఆయన మరింత మండిపడ్డాడట. ఎక్సైజ్‌కు సంబంధించి తనకు పెద్దగా విషయ పరిజ్ఞానం లేనందునే తాను పట్టించుకోలేదంటూ రోశయ్య వివరణ ఇచ్చుకుంటున్నాడు. ఈ రాద్ధాంతానికి కమిషనర్, ముఖ్యకార్యదర్శిని బాధ్యులుగా చేస్తూ వారి 'బదలీ'కి రంగం సిద్ధం చేస్తున్నాడట.

## తప్పులో కాలేసిన కెసిఆర్



తెలంగాణ విజయంతో ఊగిపోతున్న టిఆర్ఎస్ అధినేత కెసిఆర్ తప్పులో కాలేసి విమర్శలకు గురవుతున్నాడు. తెలంగాణ వాదానికి వ్యతిరేకంగా వార్తలు ప్రసారం చేస్తున్న టీవీ9, ఎన్‌టివి ఛానళ్లను బహిష్కరిస్తూ తెలంగాణ రాజకీయ జెఎసి హుకుం జారీ చేసింది. ఈ ఛానళ్లకు ప్రత్యేక తెలంగాణవాదులు ఎవరూ ఇంటర్వ్యూలు యివ్వరాదని, అసలు ఈ ఛానళ్లను దగ్గరకే రానివ్వకూడదని ఆంక్షలు విధించింది. అయితే సాక్షాత్తూ కెసిఆర్ అంతటివాడే ఈ ఆంక్షల్ని లెక్కచేయకుండా ఆ రెండు ఛానళ్లకు ఇంటర్వ్యూలు యిచ్చాడు. అంతే కాకుండా రసమయి బాలకిషన్, కొందరు టిఆర్ఎస్ ఎమ్మెల్యేలు కూడా జెఎసి 'గీత' దాటారు. దీంతో జెఎసి కన్వీనర్ కోదండరామ్ గీతదాటిన వారందరినీ సంజాయిషీ కోరాడట. ఈ తతంగాన్ని చూస్తున్నవారంతా ఇదంతా 'టీ కప్పులో తుఫాను' అంటూ కొట్టిపారేస్తున్నారు.

## రమణ దీక్షితుల హస్తిన యాత్ర



తిరుమల తిరుపతి దేవస్థానం ప్రధాన అర్చకులు రమణ దీక్షితులు ప్రస్తుతం ఢిల్లీ యాత్రలో వున్నారు. తిరుమల దేవస్థానం వ్యవహారాల్లో జరుగుతున్న అవకతవకల్ని ఢిల్లీ పెద్దల దృష్టికి తేవడానికి రమణ దీక్షితులు ప్రయత్నిస్తున్నారట. త్వరలో దేవస్థానం పాలక మండలి పదవీ కాలం ముగియనుండటంతో కొత్త పాలక వర్గం ఏర్పాటులో తగు జాగ్రత్తలు తీసుకునేలా చూడాల్సిందిగా ఆయన ఢిల్లీ పెద్దల్ని కోరుతున్నారట. దీక్షితుల వారి పర్యటనలో ప్రధాని మన్మోహన్ సింగ్‌తో సహా పలువురు కేంద్ర మంత్రులు, ప్రతిపక్ష నాయకుల్ని కూడా కలుస్తారట. గత అయిదేళ్లుగా దేవస్థానం నిర్వహణలో అనేక అవకతవకలు జరిగిన విషయాన్ని దీక్షితులు నొక్కి చెప్తున్నారట. అలాగే శ్రీకృష్ణ దేవరాయల వారు స్వామి వారికి సమర్పించిన విలువైన ఆభరణాలు మాయం కావడానికి సంబంధించిన సమాచారాన్ని కూడా ఆయన ప్రస్తావిస్తున్నారట. ఇప్పటికే తిరుమల దేవస్థానానికి సంబంధించి వివిధరకాల విచారణలు జరుగుతున్నాయి. సిఎం రోశయ్య కూడా దేవస్థానం వ్యవహారాలపై సీరియస్‌గా వున్నారు. మొత్తానికి దీక్షితుల వారి హస్తిన యాత్ర ప్రభావం ఎలా వుండబోతుందో వేచి చూడాల్సిందే.

## తాతయ్య వర్సెస్ అబ్బాయి



రాష్ట్రంలో తాతా మనవళ్ల వయస్సున్న రోశయ్య, జగన్‌ల మధ్య బహిరంగ యుద్ధం మొదలవడంతో రాజకీయం వేడెక్కింది. ఓదార్పు యాత్రలో వివాదానికి తెరతీసిన జగన్‌కు 'చెక్' పెట్టేందుకు రోశయ్య పావుల్ని కదుపుతున్నాడు. ఇప్పటికే జగన్ సన్నిహితులుగా 'ముద్ర' పడిన అంబటి రాంబాబు, గట్టు రామచందర్‌లపై సస్పెన్షన్ వేటు వేశారు. తాజాగా వైఎస్ హయాంలో ఎస్కే యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌గా నియమితులైన కుసుమకుమారిని అవినీతి ఆరోపణల కారణంగా పదవి నుంచి తొలగించారు. తాను వైఎస్ మనిషిని కాబట్టే తొలగించారంటూ కుసుమ కుమారి మీడియాకు ఎక్కారు. దీంతో జగన్‌కు చెక్ పెట్టేందుకే రోశయ్య ఇదంతా చేస్తున్నాడంటూ జగన్ వర్గీయులు కూడా ప్రత్యారోపణలకు దిగారు. ఎమ్మెల్యే కొండా సురేఖ సోనియాగాంధీకి ఓ సుదీర్ఘ లేఖ కూడా పంపారు. ఇందులో రోశయ్యపైనే ప్రధానంగా ఆరోపణలు సంధించడం విశేషం. త్వరలోనే జగన్ వర్గీయులు రోశయ్యపై తిరుగుబాటు బావుటా ఎగరేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. తాతయ్య కావాలో, అబ్బాయి కావాలో తేల్చుకోమంటూ అధిష్టానానికి కూడా అల్టిమేటం పంపుతున్నారట. మొత్తానికి చినికి చినికి ఈ గొడవ ఏమవుతుందో వేచి చూడాల్సిందే!

# వారఫలాలు

తేది 07-08-2010 నుండి 13-08-2010 వరకు కర్కాటకంలో రవి; సింహంలో బుధుడు; మీనంలో గురువు; కన్యలో శని, శుక్రుడు, కుజుడు; ధనుస్సులో రాహువు; మిధునంలో కేతువు; మిధున, కర్కాటక, సింహ, కన్యల్లో చంద్రుడు సంచరిస్తారు.


**మేషం** అశ్వని, భరణి, కృత్తిక 1 పా

సంతాన మూలంగా ఉత్సాహకరమైన వార్త వింటారు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. ధనాదాయ విషయంలో లోటు ఉండదు. పురోభివృద్ది అన్ని రంగాలలో ఉంటుంది. రాజకీయులకు అత్యంతం అనుకూలమైన కాలం. విద్యార్ధులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాలనార్జిస్తారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు.


**వృషభం** కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. ఆప్తుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాముల వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి.


**మిథునం** మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ఆహారవిషయంలో జాగ్రత్త. అభిప్రాయ భేదాలు రాకుండా చూసుకోవాలి. ఉద్యోగవృద్ది, వేతనవృద్ది ఉంటుంది. శత్రువులు లొంగి నడుచుకొంటారు. అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికా బద్ధంగా జరుపుకున్నా ఏదో లోపం ఉన్నట్టు తోస్తుంది. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం గాదు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం.


**కర్కాటకం** పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

నూతన వస్త్రాభరణాలు కొంటారు. కొంత ప్రయత్నం తర్వాతనే పనులు సాగుతాయి. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. బయటవారికోసం ఖర్చు చేస్తారు. ఆర్థికవిషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. ప్రతి పనిలో దూకుడు వద్దు. విద్యార్ధులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులకు అత్యంతం చక్కని కాలం.


**సింహం** మఖ, పుబ్బ ఉత్తర 1 పా

విరోధులు తగ్గుముఖం పడతారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి. ఇన్నాళ్ళు ఆటంకాలతో అడ్డుపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. గడచినకాలం కన్నా మేలైన కాలం. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం. రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ.


**కన్య** ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. ధనవిషయంలో కూడ కటకట తొలగవచ్చు. వ్యాపారులకు గడచిన వారం కన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఇంటిలో వివాహ సంబంధ విషయాలు ప్రస్తావనకు వస్తాయి. రాజకీయులకు దుర దృష్టకాలం. ఉద్యోగులకు గొడవలతో సాగుతుంది.

## పంచాంగం

**శుభ ముహూర్తాలు లేవు.**

12 తేదీ రంజాన్ నెల ప్రారంభం.

**ఆగష్టు తిథులు**

**ఆషాఢ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 7 | శని | ద్వాదశి | సా.6.11 | గం.ల.వ |
| 8 | ఆది | త్రయోదశి | సా.3.22 | గం.ల.వ |
| 9 | సోమ | చతుర్దశి | మ.12.04 | గం.ల.వ |
| 10 | మంగళ | అమావాస్య | ఉ.08.26 | గం.ల.వ |
| | | **శ్రావణ శుద్ధ** | | |
| | | పాడ్యమి | తె.4.40 | గం.ల.వ |
| 11 | బుధ | విదియ | రా.12.55 | గం.ల.వ |
| 12 | గురు | తదియ | రా.9.21 | గం.ల.వ |
| 13 | శుక్ర | చవితి | సా.6.08 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com


**తుల** చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

ముందుచూపుతో అడుగేయాలి. ప్రతివిషయంలో ఎదుటివారు తప్పుగా అంచనా వేస్తారు. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. నరాలకు సంబంధించిన బాధలధికం. సంతానమూలంగా మానసిక వేదనకు గురి అవుతారు. ప్రయాణాలు కోరినరీతిలో జరుగవు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. విద్యార్థులకు కొంత మేలు.


**వృశ్చికం** విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ

విందు వినోదాలలో ముఖ్యపాత్ర వహిస్తారు. చాలకాలంగా ప్రయత్నిస్తూ వచ్చిన పనులు ఈనాడు ఫలోన్ముఖమవుతాయి. పుర ప్రముఖుల పరిచయం ఆనందాన్నిస్తుంది. మనశ్చాంచల్యం ఉంటుంది. విశ్రాంతి తక్కువ. జాయింటు వ్యవహారాలు చక్క దిద్దుకొంటాయి. ఆకస్మిక సంఘటనలకు అవకాశాలున్నాయి. ఇంటిలో ఆనందదాయకమైన పరిస్థితులు చోటు చేసుకొంటాయి.


**ధనస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

భగవదారాధన వైపు మనసు పోనిస్తారు. పురోభివృద్ధికి సహాయసహకారాలందించే వారితో మైత్రి ఏర్పడుతుంది. సంతాన కారణంగా మనశ్శాంతి. మిత్రులతో కలసి వినోదయాత్రలు చేసే అవకాశాలున్నాయి. వ్యాపారవిస్తరణకు నూతన ప్రయత్నాలు చేస్తారు. నూతన విషయావగాహనకై యావ. వృత్తి ఉద్యోగాల్లో కోరుకొన్న మార్పులు చేర్పులు జరిగే సూచనలు. ఆరోగ్యం చక్కగా ఉంటుంది.


**మకరం** ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఇల్లుమార్పిడి, స్థలమార్పిడుల గురించి చింతిస్తారు. ఇంటికి సంబంధించి దుబారా ఖర్చు చేస్తారు. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. వివిధ మార్గాల ధనప్రాప్తి. అనుకూల వాతావరణం. సోదరుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలలో పురోభివృద్ధి చక్కగా ఉంటుంది. చిన్న చిన్న విరోధాలు మనశ్శాంతిని చెడగొడతాయి.


**కుంభం** ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా

పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. మిత్రులమూలంగా మేలు. ధనవిషయాలలో లోటు లేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. వివాహాది శుభకార్యాచరణకు నాంది పలుకుతారు. మాట నిలబెట్టుకోవడానికి శ్రమపడతారు. రాజకీయులకు ఉత్తమకాలం.


**మీనం** పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

బాధాదాయకమైన ఊహలకు గురి కావద్దు. పైవారితో అభిప్రాయభేదాలున్నా బయటపడనీయవద్దు. మార్పులు, చేర్పులు, కూర్పులు జరుగవచ్చు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. ఓపిక అవసరం. వివాహాది శుభకార్య ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. నూతన పరిచయాలు సత్ఫలితాలనిస్తాయి.

# కార్తీక, మాఘ, పాల్గుణ మాసాలలో గృహనిర్మాణం ఉత్తమం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

పి.లక్ష్మీనరసయ్య నెల్లూరు

*★ చైత్రం, జ్యేష్ఠ, ఆషాఢ మాసాలలో గృహ నిర్మాణాలు చేయకూడదా?*

విశ్వామిత్ర, అగస్త్య వాస్తులలో చేయకూడదనే వుంది. చైత్రం భయం, జ్యేష్ఠ మృత్యువు, ఆషాఢం ఆర్థిక నష్టం అంటున్నాయి శాస్త్రాలు.

ఇరివెల భువనేశ్వరి గూడూరు

*★ బుధుడు రాశికి అధిష్ఠాన గ్రహమని చెప్పారు. ఏ ప్లాటు కలిసి వస్తుంది.*

బుధుడికి శుక్ర, రాహు, శని గ్రహాలు మిత్రరాశులు. గురు, కుజ, కేతు, రవి గ్రహాలు శత్రు రాశులు. ఇలా బేరీజు వేస్తే మీకు ఉత్తరం ప్లాటు బాగా కలసి వస్తుంది. లక్ష్మీకృత వాస్తు యంత్రం మీకు అదృష్ట యంత్రం.

పఠాన్ మెహెరున్నీసా నెల్లూరు

*★ మా వారు వాస్తును నమ్మరు. ఇప్పుడు అనుభవిస్తున్నాం.*

ప్రహరీ లేక, దిక్కుల్లో స్థలాలు వదలక, దేవుడి గది కూడా లేక మీ గృహం 'ఓ భూత' గృహంలా వుంది. 'బయ్యా' అంటూ ఉత్తరం రాశాక తప్పక మీ పరిస్థితిని సరిచేస్తాను. అది నా బాధ్యత కూడా బెహెన్!

తాడిపత్రి రమణయ్య సైదాపురం

*★ ఈశాన్యం 'చిన్నికుండ' చాలా బాగా పని చేసింది.*

ఇంట్లో 'మనుషులు', పశువులు రోగగ్రస్థులవుతున్నప్పుడు ఈశాన్యం చిన్న కుండలో పసుపు, ఆవాలు, సాంబ్రాణి, జిల్లేడు పూలు, కర్పూరం, గుగ్గిలం మూటకట్టడాన్ని 'అగస్త్ర ధర్మకతువు' 'మృణ్మయ బంధనం' అంది. ఇది శాస్త్రీయంగా కూడా ఆరోగ్య హేతువే.

షేక్ ఫాతిమాబీ బెంగుళూరు

*★ అపార్ట్‌మెంట్ తూర్పు వైపు, గృహాలు తూర్పు, పశ్చిమంగా వున్నాయి. ఏ గృహం కలసి వస్తుంది?*

మీది సింహరాశి, మీ వారిది కన్య. అంచేత మీకు పశ్చిమ గృహం కలసి వస్తుంది. మీరు 'లక్ష్మీ కృత వాస్తు' యంత్రం ప్రతిష్ఠించాకే ఇంట్లో చేరండి.

కె.వి.నరసింహారెడ్డి రాపూరు

*★ భూమిపై గ్రహాల ప్రభావం ఎంతవరకూ నిజం?*

అమావాస్య, పౌర్ణమి రోజుల్లో మీరు సముద్ర ప్రాంతానికి వెళ్లిరండి. చంద్రుడి ఆకర్షణ వల్ల సముద్రమెంత అల్లకల్లోలంగా వుంటుందో అర్థమవుతుంది.

జి.లక్ష్మీదేవమ్మ నెల్లూరు

*★ పశ్చిమం రోడ్డు తూర్పు ఇల్లు కట్టాము. ఇప్పుడు సరిచేయాలంటే కుదరదు. ఎవరో 'గిలి' పెట్టారు.*

దీన్నే 'విరుద్ధ దిగోష ముఖం' అని వాస్తు శాస్త్రాలు చెబుతున్నాయి. రాజవీధి వైపే గృహ నిర్మాణాలు జరిగితే వాస్తు పురుషుని అనుగ్రహం లభిస్తుంది. 'సుదర్శన యంత్రం' నలభై శాతం దుష్ప్రభావాల్ని తగ్గిస్తుంది.

డాక్టర్ విజయాత్రేయి హైదరాబాద్

*★ ప్రాచీన వాస్తుశాస్త్రాలు నాలుగైదే కదా? ఆధునిక వాస్తుశాస్త్రాలు కుప్పలు తెప్పలుగా వస్తున్నాయి.*

విశ్వకర్మ ప్రకాశిక, రాజమార్తాండం లాంటివి వంద వరకూ వున్నాయి. ప్రాచీన శాస్త్రాలలోని నిర్దుష్టత, శాస్త్రప్రతిమ, నిర్ధారణలు ఆధునిక గ్రంధాలలో కనిపించవు. ఆధునిక గ్రంధాలలో ఒకరిద్దరు తప్ప ప్రతిభావంతులెవరూ లేరు.

ఎన్.లక్ష్మీరాజ్యం ఉదయగిరి

*★ 2008-09 సంవత్సరాల్లో వాడి సంపాదన బాగా వుండేది. ఈ సంవత్సరం బాగా వెనుకబడి నిరుత్సాహంగా వున్నాడు.*

వెంటనే వైడూర్యం(శ్రేష్ఠ) ధరించమని చెప్పండి. నవగ్రహ ప్రదక్షిణ శుక్రవారంతో ప్రారంభించి శనివారంతో పూర్తి చేయించండి. ఈవారం రోజులూ 'నలుగురికి' అన్నదానం చేయించండి.

# బాగా వెనుకబడ్డ పెద్దపుత్తేడు గ్రామపంచాయితీ!

దగదర్తి మండలంలోని పెద్దపుత్తేడు గ్రామపంచాయితీ అన్నింటిలో బాగా వెనుకబడి వుంది. ప్రభుత్వం నుంచి గాని, ప్రజాప్రతినిధుల నుంచి గాని ఎటువంటి సహకారం అందకపోవడంతో మారుమూల గ్రామాన్ని తలపించే విధంగా వుంది. మేజర్ పంచాయితీగా గుర్తించిన పంచాయితీ అధికారులు దీని అభివృద్ధి గురించి మాత్రం పట్టించుకోకుండా చేతులెత్తేశారు. గ్రామ పంచాయితీకి రావాల్సిన పన్నులను సకాలంలో వసూలు చేసేవారు లేకుండా పోవడంతో బకాయిలు పేరుకుపోతున్నాయి.

గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా తెలుగుదేశం పార్టీకి చెందిన శింబోతు సీతారావమ్మ ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఈ పంచాయితీ పరిధిలో ఉప్పలపాడు, గొట్లపాళెం, ప్యాట్సిన్‌పేట, రామలింగాపురం తదితర గ్రామాలున్నాయి. ఈ పంచాయితీ పరిధిలో అధికంగా ఎస్సీ, ఎస్టీలు వున్నారు. 4వేల కుటుంబాలు, 8వేల జనాభా, 6వేల మంది ఓటర్లు వున్నారు. పంచాయితీ పరిధిలో పారిశుధ్యం చాలా అధ్వాన్నంగా కనిపిస్తుంది. ప్రధానంగా త్రాగునీటి సమస్య ఇక్కడి ప్రజలను పట్టి పీడిస్తుంది.

### సహకారం లేదు!



గ్రామపంచాయితీ సర్పంచ్‌గా ఎన్నికైనప్పటి నుంచి అభివృద్ధి పనులు చేపట్టాలని ఎంత ప్రయత్నిస్తున్నా అధికార యంత్రాంగం సహకరించడం లేదు. నేను ప్రతిపక్ష పార్టీకి చెందిన సర్పంచ్ కావడం వలన అధికారపార్టీకి చెందిన నేతలు అడ్డు తగలడంతోపాటు మండలస్థాయి అధికారులపై కూడా ఒత్తిడి తెచ్చి నిధులు మంజూరు కాకుండా చేస్తున్నారు.

– ***శింబోతు సీతారావమ్మ,*** సర్పంచ్

త్రాగునీరు అందరికి సరఫరా కాకపోవడంతో చాలా ఇబ్బంది పడాల్సి వస్తుంది. గ్రామాల్లో అంతర్గత రోడ్లు కూడా అధ్వాన్నంగా తయారై వున్నాయి. గ్రామ పంచాయితీ పన్నుల రూపంలో దాదాపు లక్షరూపాయలు వసూలు కావాల్సి వున్నా సిబ్బంది కొరత కారణంగా 30 శాతం కూడా వసూళ్లు కాకుండాపోతున్నాయి. గ్రామపంచాయితీ కార్యాలయం ప్రస్తుతం కూలిపోయే దశకు చేరింది. ఏ క్షణంలోనైన ఈ భవనం కూలే ప్రమాదం వుంది. రికార్డులు, ఇతర సామాగ్రిని వేరే భవనంలోకి చేర్చేందుకు ప్రయత్నాలు జరుపుతున్నారు. గ్రామ పంచాయితీ సర్పంచ్ మహిళ కావడం వలన అభివృద్ధి పనులు చేపట్టలేక పోతున్నారన్న అభిప్రాయం స్థానికుల నుంచి వ్యక్తమవుతుంది.

12వ ఆర్థిక సంఘం, ఎస్ఎఫ్‌సి నిధులు కలిపి మరో లక్షా 60 వేల రూపాయలు ప్రభుత్వం నుంచి గ్రాంటు రూపంలో విడుదలవుతున్నాయి. ఈ నిధులతో విద్యుత్ బిల్లుల బకాయిలు చెల్లిస్తున్నారే తప్ప ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించేందుకు పాలకవర్గం తగిన చర్యలు తీసుకోవడం లేదు. గతంలో అల్లూరు అసెంబ్లీ నియోజకవర్గంలో వున్న ఈ పంచాయితీ ప్రస్తుతం కావలి అసెంబ్లీ నియోజకవర్గంలో వుంది. స్థానిక ఎమ్మెల్యేగా వున్న బీద మస్తాన్‌రావు కూడా పంచాయితీ అభివృద్ధిపై దృష్టిసారించడం లేదు. ఎమ్మెల్యే నిధులుగాని, జడ్పీ నిధులు గాని ఏవీ కూడా ఈ పంచాయితీకి అందడం లేదు.

త్రాగునీటి సమస్య, గ్రామపంచాయితీలో పక్కా భవన నిర్మాణం కోసం అనేక దఫాలు ఉన్నతాధికారులు, ప్రజాప్రతినిధులకు వినతి పత్రాలు సమర్పించినా కూడా ఎటువంటి ఫలితం కానరాలేదని సర్పంచ్ ఆవేదన. అభివృద్ధి పనులు చేపట్టలేకపోవడంతో ఇంటి పన్నులను చెల్లించేందుకు స్థానికులు నిరాకరిస్తున్నారు. దీంతో చేసేది ఏమి లేక పన్నుల గురించి అడగడం మానేస్తున్నారు. జిల్లాలోని అన్ని పంచాయితీల కంటే ఈ పంచాయితీ అధ్వాన్నంగా వుండడం విశేషం.



*శిథిలావస్థలో పెద్దపుత్తేడు గ్రామ పంచాయితీ కార్యాలయం.*



*మట్టితో నిండిపోయిన గ్రామంలోని మెయిన్ రోడ్డు.*

**అవినీతి కథ**

### నెల్లూరు మార్కెట్‌లో

# నాసిరకం పురుగు మందులు!

జిల్లాలో వ్యవసాయ సీజన్ మొదలు కావడంతో విజిలెన్స్ అధికారులు రొటీన్‌గా చేసిన తనిఖీల్లో కోట్లాదిరూపాయల విలువ చేసే నాసిరకం పురుగుమందులు, కీటక నాశనులు దొరికి సంచలనం సృష్టించాయి.



*ఏ విషయాన్నీ సీరియస్‌గా తీసుకోని నెల్లూరులోని వ్యవసాయ శాఖ కార్యాలయం. (ఫైల్‌ఫోటో)*

ఇటీవల జిల్లావ్యాప్తంగా ఎరువులు, పురుగుమందులు విక్రయించే దుకాణాలపై విజిలెన్స్ అధికారులు దాడులు నిర్వహిస్తున్నారు. ఈ దాడుల్లో నకిలీ పురుగుమందుల్ని గుర్తించారు. ప్రస్తుత వ్యవసాయ సీజన్‌లో నాసిరకం పురుగుమందుల్ని రైతులు కొనుగోలు చేసి వాడడంతో పంట దిగుబడి రాక ఆర్థికంగా నష్టపోవాల్సి వచ్చింది. ఈ విషయం అధికారుల దృష్టికి వెళ్లడంతో తప్పనిసరి పరిస్థితుల్లో ఎరువుల దుకాణాలపై దాడులు చేస్తున్నారు.

జిల్లా వ్యవసాయశాఖ అధికారులు అవినీతి, అక్రమాలు కారణంగానే నకిలీ పురుగుమందులు, విత్తనాల వ్యాపారస్తులు బహిరంగంగా విక్రయించగలుగుతున్నారు. నిబంధనల ప్రకారం రసాయనిక ఎరువులు, పురుగుమందులు విక్రయించాలంటే వ్యవసాయశాఖ నుంచి వేర్వేరుగా లైసెన్స్ పొందాల్సి వుంటుంది. ఒకసారి లైసెన్స్ పొందిన వ్యాపారులు ప్రతి సంవత్సరం మరికొంత ఫీజు చెల్లించి రెన్యూవల్ చేయించుకోవాల్సి వుంటుంది. కొంతమంది ఎరువుల దుకాణాదారులు నిబంధనలు పాటిస్తుండగా ఎక్కువమంది వ్యాపారులు నిబంధనల ప్రకారం వ్యాపారాలు చేయడం లేదు.

రసాయనిక ఎరువులను విక్రయించేందుకు లైసెన్స్ పొంది పురుగుమందులు, విత్తనాలను సైతం విక్రయించేస్తున్నారు. ప్రతిదానికి లైసెన్స్ పొందాలంటే అధికంగా ఫీజు చెల్లించాల్సి రావడం, రెన్యూవల్ చేయించుకోవడం ఎందుకని భావించి ఒక్క లైసెన్స్‌తో వ్యవసాయానికి సంబంధించిన అన్ని రకాల మందులను విక్రయిస్తున్నారు. ఈ విషయం సంబంధిత అధికారులకు తెలిసినా కూడా దుకాణాదారులపై ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. మండల కేంద్రాల్లో నకిలీ పురుగు మందుల విక్రయాలు బహిరంగంగానే సాగిస్తున్నారు.

అధిక దిగుబడులు వస్తాయని ఆశించిన రైతులకు నకిలీ పురుగు మందుల వాడకం కారణంగా నష్టాలు సంభవిస్తున్నాయి. రైతులు అనేక దఫాలు వ్యవసాయశాఖ అధికారులకు విజ్ఞప్తిచేసినా వీటిని నివారించలేకపోతున్నారు. విజిలెన్స్ విభాగం అధికారులు దాడులు చేసిన సమయంలో మాత్రమే నకిలీ పురుగుమందుల వివరాలు బయటపడుతున్నాయి. లేకుంటే సాధారణ మందుల మాదిరిగానే వీటిని రైతులకు అమ్ముతుంటారు. నకిలీ పురుగుమందులు ఎక్కడి నుంచి జిల్లాకు వస్తున్నాయి? వీటిని ఏ డీలర్లు విక్రయిస్తున్నారు? అన్న సమాచారాన్ని మాత్రం సేకరించలేకపోతున్నారు.

### మామూళ్లే కారణం

లైసెన్స్ లేకుండా పురుగుమందులు విక్రయిస్తున్న ఎరువుల దుకాణాల యజమాన్యాల నుంచి వ్యవసాయశాఖ అధికారులు భారీ స్థాయిలో మామూళ్లు గుంజుతున్నారు. అధికార్లు, సిబ్బంది అడిగినంత నగదు చేతుల్లో పెడితే ఎటువంటి తనిఖీలుండవన్న భావంతో వ్యాపారులు వెనకా ముందు ఆలోచించకుండా సరేనంటున్నారు. వ్యవసాయ శాఖ పరిధిలో నిత్యం పర్యవేక్షణ చేయాల్సిన మండల వ్యవసాయ అధికారులు దుకాణాల వైపు కన్నెత్తి కూడా చూడడం లేదు. అసలు అధికారులు లైసెన్స్ పొందిన దుకాణాల జాబితాను వెల్లడించేందుకు నిరాకరిస్తున్నారు.

రైతుల పాలిట శాపంగా పరిణమిస్తున్న నకిలీ పురుగుమందులు, విత్తనాలు విక్రయిస్తున్న వారిపై కఠిన చర్యలు తీసుకోవాలని రైతాంగం గగ్గోలు పెడుతోంది. ఇటువంటి వారిపై క్రిమినల్ కేసులు నమోదు చేయడంతోపాటు రైతులకు తగిన నష్టపరిహారం ఇప్పించే విధంగా ప్రభుత్వం చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

# 'మర్యాదరామన్న' మంచిగున్నాడు!



✍ అల్లూరు రహీం

మగధీర చిత్ర విజయం తర్వాత దర్శకుడు రాజమౌళి ఖ్యాతి విఖ్యాతమయ్యింది. అటువంటి దర్శకుడు ఆర్కా మీడియా పతాకంపై హాస్యనటుడు సునీల్‌ను హీరోగా చేసి తీసిన చిత్రమే మర్యాదరామన్న. వాస్తవానికి ఈ చిత్రం గతంలో వచ్చిన ఆంగ్ల చిత్రం అవర్ హాస్పిటాలిటీని మక్కిమక్కికి కాపీ కొట్టారు. కాని రాజమౌళి మాత్రం ఈ చిత్రకథ లైన్‌ను 'కాంచి' చెప్పగా తీశానంటున్నాడు. ఏమైతేనేం ఎక్కడో కొట్టుకొచ్చిన కథకు తనదైన ధోరణి స్క్రీన్‌ప్లేతో మెరుగులు పెట్టి మర్యాదరామన్నను జనరంజకంగా తీర్చిదిద్దాడు రాజమౌళి. ఈ చిత్రంలో హీరో సునీల్ సీరియస్‌గా వుంటూనే మంచి హాస్యాన్ని ఒలికించాడు. ఇప్పటి యంగ్ హీరోల కంటే మెరుగ్గా నర్తించాడు. హీరోయిన్ సలోని ముద్దుముచ్చటతో ప్రేక్షకులను మురిపిస్తుంది. చిన్న సినిమా అని రాజమౌళి మర్యాదరామన్నపై చిన్నచూపు చూడలేదు. పాటల్లో, సైకిల్‌తో కార్ల ఛేజింగ్ సన్నివేశంలో అబ్బుర పరిచే గ్రాఫిక్స్‌ను పెట్టాడు. రైలులో కరెంట్ పోగా మిణుగురు పురుగులు వచ్చే సన్నివేశం మనసును హత్తుకొంటుంది. రైలు కిటికీలో కొబ్బరి బోండాం ఇరుక్కొనే సన్నివేశంతోపాటు సునీల్ తొక్కే సైకిల్‌కు హీరో రవితేజ మాటలు ప్రేక్షకులను అలరిస్తాయి. ఫ్యాక్షన్ సినిమా కాదంటూనే ఇటువంటివి కొన్ని సన్నివేశాలున్నాయి. రాయలసీమలో కరణాలు ఇంకా వున్నారా అనే సందేహం ఈ చిత్రం చూస్తున్న ప్రేక్షకులకు కలుగుతుంది. సినిమాలో ముఖ్యమైన పాయింట్ హీరో కోసం రాయలసీమ ఫ్యాక్షనిస్టులు జీవితకాలం వెదకుతుంటారు. కాని అతని చిరునామాను తెలుసుకోలేరు. కాని అక్కడి ఎమ్మార్వో కార్యాలయానికి మాత్రం హీరో అడ్రస్ తెలిసి కొరియర్‌లో వుత్తరం పంపుతారు? ఇదెలా సాధ్యం అగ్రదర్శక ప్రముఖా? కీరవాణి సంగీతం సమకూర్చిన రాయే రాయే సలోని, తెలుగమ్మాయి, పరుగులు తీయి పాటలు బాగున్నాయి. సినిమాలో రాయలసీమ మాండలికం మాటలు బాగా కుదిరాయి. కొన్ని సన్నివేశాల్లో కెమెరామెన్ రాంప్రసాద్ అద్భుత ప్రతిభ చూపాడు.




చిత్రకథలోనికి వెళ్తే రాయలసీమ ఫ్యాక్షనిజానికి అంతమైన కోవెలమూడి రాఘవరావు భార్య తన కుమారుడు రాము(సునీల్)తో సహా హైదరాబాద్‌కు వచ్చి అజ్ఞాతంగా బతుకుతూ ప్రాణాలు విడుస్తుంది. సైకిల్‌పై మూటలు పెట్టుకొని కిరణాషాపులకు తీసుకవెళ్తుండే రామును అతని షావుకారు ట్రాలీ కొనుక్కొని తనకు కనపడమని హుకుం జారీ చేస్తాడు. బతుకు తెరువు పోవడంతో రాము గాబరాపడిపోతాడు. ఇంతలో తాడిపత్రి ఎమ్మార్వో కార్యాలయం నుంచి కొరియర్‌లో అతనికి ఓ లేఖ వస్తుంది. రాఘవరావుకు సంబంధించిన ఐదెకరాల భూమికి వారసులకు పరిహారం ఇస్తామని అందులో వుంటుంది. వుత్తరం తీసుకొని రాయలసీమ ఎక్స్‌ప్రెస్ ఎక్కే రాముకు సహప్రయాణీకురాలుగా అపర్ణ (సలోని) పరిచయమవుతుంది. రైలులో కొన్ని సంఘటనల అనంతరం రాము అపర్ణను ఎంతగానో అభిమానిస్తాడు. గ్రామస్తులు ఇచ్చిన సలహా మేరకు గ్రామపెద్ద ఫ్యాక్షనిస్ట్ రామినీడు (నాగినీడు) ఇంటికి రాము వెళ్తాడు. తన భూమిని ఏదో ఒక రేటుకు అమ్మించి ఇవ్వమంటాడు. ఇంతలో అపర్ణ అక్కడకు వస్తుంది. ఆమె రామినీడు కుమార్తె. రామును రామినీడు ఇంటికి తీసుకవచ్చే బండ్ల సూరి (సుప్రీత్)కు అతను తాము 28 ఏళ్ల నుంచి వెతుకుతున్న శత్రువు కోవెలమూడి రాఘవరావు కొడుకని తెలుస్తుంది. ఈ విషయం రాముతో కలసి భోజనం చేస్తుండే తండ్రి రామినీడుకు చెప్తాడు. ఈయనకు ఓ సెంటిమెంట్ వుంటుంది. ఇంట్లో హత్యలు చేయడు. దీంతో రామును గడపదాటించి లేపివేయాలనుకొంటాడు. విషయం తెలుసుకొన్న రాము గడపదాటడు. డాక్టర్ శ్రీకాంత్ (బ్రహ్మాజీ) అపర్ణకు బావ. వీరిద్దరి నిశ్చితార్థానికి రాము తెలివిగా శ్రీకాంత్ తల్లితండ్రులతో కలసి ప్లాన్ చేస్తాడు. కాని అపర్ణ రామును ఇష్టపడుతుంది. రామును చంపాలనుకొన్న తండ్రికి అపర్ణ అడ్డు పడుతుంది. రాము అపర్ణను ఏ విధంగా ప్రేమిస్తున్నాడన్న విషయం ఆమెను ఓ ప్రమాదం నుంచి కాపాడడంతో తెలుసుకొన్న ఫ్యాక్షనిస్ట్ రామినీడు కుటుంబం సిగ్గిల్లి ప్రేమికులిద్దరినీ కలపడంతో చిత్రం ముగుస్తుంది.



## ముంబాయి బాగుంది!



కట్టామీటా చిత్రం ద్వార బాలీవుడ్‌లో రంగప్రవేశం చేసింది దక్షిణాది ముద్దుగుమ్మ త్రిష. ఈమెకు ముంబాయి నగరం బాగా నచ్చినట్లుంది. ఆ నగరాన్ని తెగ పొగుడుతూ మాట్లాడుతుంది. ముంబాయి చాలా అందమైన నగరం. అక్కడ అమ్మాయిలు అర్థరాత్రి రోడ్ల మీద స్వేచ్ఛగా తిరగొచ్చు. ఎటువంటి భయమూ లేదు. వీధుల్లో ఫుట్‌పాత్‌లపై తిరుగుతూ కొత్తకొత్త రుచులు ఆస్వాదించవచ్చు. మంచి భోజనం కూడా దొరుకుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే స్వేచ్ఛాయుతంగా గడపడానికి ఎంతో అనువైన ప్రదేశమని చెప్పుకొచ్చింది త్రిష సుందరి.

## కలలో కూడా ఊహించలేదు!



ఏమాయచేశావె చిత్ర విజయంతో హీరోయిన్ సమంత ఇటు ప్రేక్షకులలోనూ అటు పరిశ్రమలోనూ గుర్తింపు తెచ్చుకొంది. దీంతో ఎన్టీఆర్, మహేష్‌బాబు సినిమాల్లో నటించే అవకాశం దక్కించుకొంది. తన అదృష్టం తలచుకొంటూ ఉప్పొంగిపోతోంది సమంత. ఈ విషయమై మాట్లాడుతూ ప్రతిరోజూ నా అదృష్టం రెండింతలు అవుతుందేమో అనిపిస్తోంది. ఒక్క సినిమాతో ఇంతపేరు... ఇన్ని సినిమాలు కలలో కూడా ఊహించలేదు. తెలుగు ప్రేక్షకుల ఆదరణ ఎప్పటికీ మర్చిపోలేనిది. దాన్ని నిలుపుకొంటాను. ఏమాయచేశావె తర్వాత చాలా కథలు విన్నాను. ఒప్పుకోవడానికి మాత్రం సమయం తీసుకొన్నాను. కంగారుపడి ఏదో ఒకటి చేసేయాలని లేదు. నిదానంగా ఒకదాని తర్వాత మరో చిత్రం చేసుకుంటే చాలంటున్నది ఈ సుందరి.

## నిలదొక్కుకొంటాను!



ఝుమ్మందినాదం చిత్రం హీరోయిన్ తాప్సీకి ఏకంగా మూడు చిత్రాలు తెచ్చి పెట్టింది. హీరోలు ప్రభాస్, విష్ణు, రవితేజల సరసన నటిస్తుందామె. ఈ విషయమై వివరిస్తూ తెలుగు ప్రేక్షకులు నన్ను ఇంతగా ఆదరిస్తారని ఊహించలేదు. నచ్చితే తెలుగువాళ్లు చూపించే అభిమానం ఏ స్థాయిలో వుంటుందో చవి చూశాను. పరిశ్రమలో తోటి హీరోయిన్ల మధ్య పోటీని తట్టుకొని నిలబడతానన్న ధైర్యం వుంది. అయినా పోటీ వుంటేనే కదా మజా! వైవిధ్యమైన పాత్రలు ఎంచుకొంటూ నటిస్తే పరిశ్రమలో మన స్థానం పదిలమంటుంది ఈ అమ్మడు.

## నటించడం కష్టమండీ!



పవన్‌కళ్యాణ్ సరసన కొమరంపులి చిత్రంలో హీరోయిన్‌గా చేస్తున్న ముద్దుగుమ్మ నికిషాపటేల్‌ది అమెరికాలోని వేల్స్ పట్టణం. గతంలో ఫ్యాషన్ షోలు చేసేది. బి.బి.సిలో కొన్నాళ్లు పని చేసింది. దర్శకుడు ఎస్.జె. సూర్య ముంబాయిలో నిర్వహించిన అడిషన్స్‌లో హీరోయిన్‌గా ఎంపిక చేశాడట. ఈ విషయాలను నికిషా చెబుతూ చిన్నప్పటి నుంచి నటి కావడం నా కల. అదృష్టం కలసి వచ్చి నటిని అయ్యాను. కాని చదవడం కన్నా నటించడం కష్టమని పులి చిత్రంలో నటిస్తూ తెలుసుకున్నాను. మూస పాత్రలు కాకుండా ఛాలెంజింగ్ పాత్రలు పోషిస్తూ కెరీర్‌ను తీర్చిదిద్దుకొంటానంటున్నది ఈ చిన్నది.

## పెళ్లీడు రాలేదు!



గతంలో ఆంధ్రుడు, ఆకాశరామన్న, హౌస్‌ఫుల్ ప్రస్తుతం నిత్యపెళ్లికొడుకు చిత్రంలో హీరోయిన్‌గా నటిస్తున్న గౌరీపండిట్ తెలుగులో మరిన్ని అవకాశాల కోసం ఎదురుచూస్తుంది. ఆంధ్రుడు చిత్రంతో మంచి గుర్తింపు వచ్చినా బిజినెస్ మేనేజ్‌మెంట్ కోర్సు చదవను జపాన్ వెళ్లడంతో నిర్మాతలు నన్ను వాకబు చేసి గమ్మునైపోయారు. ఇప్పుడు కోర్సు పూర్తయ్యింది. ఏ పాత్రలైనా చేయడానికి రెడీ. సన్నివేశం డిమాండ్ చేస్తే ముద్దు, బికినీలూ ధరిస్తాను. ఏరోజుకైనా ప్రేమ వివాహం చేసుకొంటాను. అయితే నాకింకా పెళ్లీడు రాలేదు. వచ్చిన తర్వాత ప్రేమించే పెళ్లాడతానని స్పష్టం చేసింది.

## స్థానిక సంస్థల్లో విజయమే లక్ష్యం!

తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యవర్గం కొలువుదీరింది. జూలై 24 శనివారం జిల్లా అధ్యక్ష, కార్యదర్శులతోపాటు మొత్తం కార్యవర్గం బాధ్యతలు చేపట్టింది. సీనియర్ తెలుగుదేశం నేత బెజవాడ ఓబుల్‌రెడ్డి జిల్లా అధ్యక్షునిగా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, ప్రధాన కార్యదర్శిగా గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌రావు చేత ప్రమాణ స్వీకారం చేయించారు. పది మంది పార్టీ ఉపాధ్యక్షులు, కోశాధికారి, ప్రత్యేక ఆహ్వానితులు 18 మంది, కార్యవర్గ సభ్యులు 24 మంది ప్రమాణం చేశారు. నగర పార్టీ అధ్యక్షుడు కిలారి వెంకట



*తెలుగుదేశం నూతన కార్యవర్గం బాధ్యతల స్వీకరణోత్సవం.*

స్వామినాయుడు జిల్లా అధ్యక్ష బాధ్యతలు చేపట్టిన సోమిరెడ్డిని, ప్రధాన కార్యదర్శియైన బల్లి దుర్గాప్రసాద్‌ను గజమాలతో సన్మానించి పూల బొకేలను చేతికందించారు. ఈ సందర్భంగా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కార్యకర్తలకు ఉత్తేజం కల్గించే రీతిలో మాట్లాడారు. జరగబోయే స్థానిక సంస్థల ఎన్నికల్లో పార్టీని విజయపథాన నడిపించేందుకు అందరూ సమాయత్తం కావాలన్నారు. మూడు మునిసిపాలిటీల్లో టిడిపి జయకేతనం ఎగురవేసేలా పార్టీని బలోపేతం చేస్తామన్నారు. ఈ కార్యక్రమంలో వెంకటగిరి, కావలి, సూళ్లూరుపేట ఎమ్మెల్యేలు కురుగొండ్ల రామకృష్ణ, బీద మస్తాన్‌రావు, పరసా రత్నం, కంభం, రమేష్‌రెడ్డి, ఉక్కాల రాజేశ్వరమ్మ తదితరులు పాల్గొన్నారు.

## గజిబిజి గందరగోళం

నగరంలో ట్రాఫిక్ సమస్య రోజురోజుకు జఠిలం అవుతూనే వుంది. పేరుకు నగర హోదా సంతరించుకొన్నా దానికి తగినట్లు రోడ్ల విస్తరణ చేయకపోవడం, సమాంతర రోడ్లను అభివృద్ధి పరచక పోవడంతో ఎక్కడికక్కడ ట్రాఫిక్ సమస్యలు ఎదురౌతునే వున్నాయి నగరవాసులకు. ముత్తుకూరు బస్టాండ్ సెంటర్ వద్ద ఈ సమస్య అధికంగా వుంది. హరనాథపురం అండర్ బ్రిడ్జి నుంచి, విఆర్ కాలేజి నుంచి వచ్చే వాహనాలు కళ్యాణి ఫిలింస్ మీదుగా వెళ్తుంటాయి. పొగతోటలోని వివిధ ఆస్పత్రులకు వచ్చే వారు, మూడు హాళ్లకు పోయేవారు, విజయమహల్‌గేటు, తదితర ప్రాంతాలకు వెళ్లేవారు ఈ మార్గం గుండా ప్రయాణిస్తుంటారు. అంతటి ప్రాధాన్యత గల మార్గంలో

### ముత్తుకూరు బస్టాండ్ వద్ద ట్రాఫిక్ తీరిది

వాహనాలను అడ్డదిడ్డంగా నిలపడం మూలంగా నిత్యం ట్రాఫిక్ సమస్య ఎదురౌతుంది. గుంటలు మిట్టలుగా మారిన ఈ రోడ్డులో పెట్రోల్ బంక్ నుంచి మలుపుతిరిగే చోట ఆటోలను, ఇతర వాహనాలను రోడ్డుకి రెండు వైపులా పార్క్ చేస్తుండడంతో వాహనాల రాకపోకలకు తీవ్ర అంతరాయం ఎదురౌతున్నది. చికిత్స కోసం వెళ్లే వారికి, ఇతరత్రా పనులపై వెళ్లే వారు తీవ్ర ఇబ్బందులు పడుతున్నా ఏ ట్రాఫిక్ పోలీసు ఈ రోడ్డు గురించి పట్టించుకోక పోవడంతో కొద్ది దూరం వున్నా ఈ రోడ్డుపై ప్రయాణించాలంటేనే హడలి పోతున్నారు జనం. జయభారత్ హాస్పిటల్ రోడ్డుదీ ఇదే పరిస్థితి. అక్కడా క్షణక్షణం ట్రాఫిక్ సమస్యే. ఇరుకైన రోడ్డు, ఆపైన ఆక్రమణలతో రాకపోకలకు ఆటంకం కల్గుతున్నది. ట్రాఫిక్‌ను గాడిలో పెట్టాలని తలచే పోలీసు పెద్దలు ముందు చిన్న చిన్న రోడ్లు, సమాంతర రోడ్లపై దృష్టి సారిస్తే ప్రజలకు కొంతమేర ట్రాఫిక్ సమస్యలు తీరుతాయి.

## నెల్లూరులో ఓనమ్ వేడుకలు

కేరళీయులు సాంప్రదాయ బద్ధంగా నిర్వహించుకొనే ఓనమ్ వేడుకలు ఆగష్టు 1వ తేది పురమందిరంలో ఘనంగా జరిగాయి. ప్రతి ఏడాది క్రమం తప్పకుండా నగరంలోని కేరళీయులు ఈ ఉత్సవాలను నిర్వహించడం ఆనవాయితీ. దీనికి అనుగుణంగా ఈసారి వేడుకగా జరిగాయి. వివిధ వ్యాపారాలు, ఉద్యోగాలు చేసుకొనే కేరళ రాష్ట్రానికి చెందిన మళయాళీలు అందరూ ఒకచోట చేరి స్నేహ భావంతో మెలగడమీ వేడుకల విశేషం. జిల్లా కలెక్టర్ రాంగోపాల్




*ఓనమ్ వేడుకల్లో మాట్లాడుతున్న కలెక్టర్ రాంగోపాల్.*

ముఖ్య అతిథిగా ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. ఆయన కేరళీయుల స్నేహవాత్సల్యాన్ని ప్రత్యేకంగా ప్రశంసించారు. విద్యపై ఎంతో మక్కువగల వారు కేరళ ప్రాంతం వారని, అందుకే దేశంలో విద్యా ప్రమాణాలలో కేరళ రాష్ట్రం అగ్రభాగాన వుందన్నారు. విద్యకు ఇచ్చే ప్రాధాన్యతను ప్రతిఒక్కరూ కేరళ ప్రాంతం వారిని చూసి నేర్చుకోవాలన్నారు. ఈ సందర్భంగా మాస్టర్ ఆదర్శ్ చేసిన సాంప్రదాయ నృత్యం ఆకట్టుకొంది. అమరావతి హోటల్ నిర్వాహకుడు కృష్ణారెడ్డి, కేరళ అసోసియేషన్ సభ్యులు ఈ కార్యక్రమానికి హాజరై ఉత్సాహంగా గడిపారు.

● కెవిపి మీట నొక్కేవరకు

# జగన్ కోరిక తీరదు!



ఓదార్పు యాత్రతో రోశయ్య సర్కారును కంపింప చేయాలని వైఎస్ జగన్ చేసిన ప్రయత్నం దారుణంగా విఫలమైంది. కాకినాడ సభకు యాభై మంది ఎమ్మెల్యేలు వచ్చివుంటే కాంగ్రెస్ అధిష్టానం ఉలిక్కిపడి వుండేది. కానీ ఆ సంఖ్య అందులో సగమే కావడంతో అందరూ తేలికగా తీసుకొన్నారు. ప్రయాస తప్ప ఫలితం లేకుండా పోయింది.

రోశయ్య సర్కారును కూలగొడితే తప్ప తనకు విలువ, ప్రాధాన్యత రాదన్నది జగన్ ఆంతర్యం. కానీ అది జరిగే సూచనలు కన్పించడం లేదు. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి అనుచరులు, అభిమానులు, అంతరంగికులందరూ జగన్‌ను విశ్వసించడం లేదు. వారందరి దృష్టి కెవిపి రామచంద్రరావు మీదే కేంద్రీకృతమై వుంది. ఆయన కన్ను గీటితే, మీట నొక్కితే తప్ప వీరిలో కదలిక రాదన్నది సత్యం. అయితే కెవిపి అందుకు సిద్ధంగా లేడు. జగన్ పట్ల ఆయనకు సానుభూతి లేకుండా పోలేదు. కానీ ఇప్పటికిప్పుడు కాంగ్రెస్‌ను వదలిపెడితే జగన్‌కు రాజకీయ భవిష్యత్తు వుండదన్నది ఆయన అభిప్రాయం. అయితే దానితో జగన్ ఏకీభవించడం లేదు. మరొక పాతికేళ్ళు ఎదురు చూసినా కాంగ్రెస్ పెద్దలు తనను నమ్మరు, ముఖ్యమంత్రి పీఠం ఎక్కించరని జగన్ వాదిస్తున్నాడు. వీరిద్దరి మధ్య ఏకాభిప్రాయం కుదరడం లేదు. దాన్ని అలుసుగా తీసుకొని వైఎస్ అనుచర ఎమ్మెల్యేలందరూ జగన్‌కు దూరంగా మసలుతున్నారు.

కాంగ్రెస్ అధిష్టానం కూడా కెవిపిని తొక్కిపెడుతున్నది. ఆయన ముఖ్యమంత్రి రోశయ్యకు ముఖ్యసలహాదారుగా మెలిగేట్లు ప్రలోభ పెడుతున్నది. వైఎస్‌కు, వ్యాపార వర్గాలకు మధ్య సంబంధాలకు కీలకం కెవిపి అన్న నిజం అందరికీ తెలుసు. వేల కోట్ల ఒప్పందాలు ఆయన ద్వారానే జరిగాయి. వాటి కొనసాగింపును ఆయన చేతుల మీదుగానే జరిపిస్తున్నది కాంగ్రెస్ అధిష్టానం. అందువల్ల రోశయ్య ప్రభుత్వంతో పేచీకి కెవిపి సిద్ధపడలేకపోతున్నాడు. ఏ మాత్రం సంబంధాలు చెడినా, ఈ వ్యాపార ఒప్పందాలు చిక్కుల్లో పడుతాయన్నది భయం. మరొకప్రక్క సరైన రాజకీయ అనుభవం, అవగాహన లేకుండా ఒకేసారి నేరుగా ప్రభుత్వాన్ని పడగొట్టడం, స్వంత పార్టీతో ఎన్నికలను ఎదుర్కోవడం వంటివి దుస్సాహసాలుగా పరిణమిస్తాయని కెవిపి భయం. ఒకటికి రెండుసార్లు అవకాశం వచ్చినా వైఎస్ అంతటివాడు సాహసించలేకపోయిన ఆ అసాధ్యాన్ని జగన్ నెత్తికెత్తుకోవడం మంచిది కాదని భావన. వీటన్నిటితో ఎంతో నిగ్రహం పాటిస్తున్నాడు కెవిపి. వైఎస్‌కు ద్రోహం చేస్తున్నాడన్న నిందను కూడా భరిస్తున్నాడు. ఎట్లయినా జగన్‌ను తన దారికి తెచ్చుకోగలనన్న నమ్మకంతో కాలం నెట్టుకొస్తున్నాడు. అయితే అంత ఓపిక జగన్‌లో లేదు. తన తండ్రి జీవితకాలం శ్రమించి సంపాదించుకొన్న రాజకీయ పలుకుబడి సమస్తం కెవిపి చేతుల్లో చిక్కుకోవడాన్ని జగన్ సహించలేకపోతున్నాడు.

కాంగ్రెస్ పెద్దలు కూడా దీన్నొక ఆటగా పరిగణిస్తున్నాయి. కెవిపి చెంత చేరే వరకు జగన్ కాగితం పులి మాత్రమే అనే ధీమాతోనే కొండా సురేఖ సస్పెన్షన్‌కు రంగం సిద్ధం చేసింది అధిష్టానం. ఆమెను కాపాడుకోవడం జగన్‌కు తప్పనిసరి. అందులో విఫలమైతే తనతో రావాలనుకొనే ఎమ్మెల్యేలు, ఎమ్పీలు వెనుకడుగు వేస్తారని తెలుసు. కానీ ఎట్లా కాపాడుకోవాలో అర్థం కావడం లేదు. జగన్ ప్రయత్నాల వల్ల రోశయ్య సర్కారు పడిపోయి ఎన్నికలు తప్పనిసరి అయ్యే పరిస్థితి వస్తుందన్న నమ్మకం కలిగితే కొంతమంది ఆయనతో కలిసి నడవడానికి సిద్ధంగా వున్నారు. కానీ సస్పెన్షన్లు, సంజాయిషీ నోటీసులు తప్ప మరేమీ జరగదన్న సందేశం వెళ్తే దగ్గరకు వచ్చిన వారు కూడా పీచే ముడ్ అనేస్తారు. మూడున్నరేళ్ల పదవీ కాలాన్ని త్యాగం చేసే త్యాగరాజులెవరుంటారు రాజకీయాలలో?

మొత్తం మీద కొండా సురేఖ సస్పెన్షన్ పరిణామంతో జగన్ తిరుగుబాటు ప్రయత్నం కీలక దశకు చేరుకొన్నది. పరిస్థితులు అనుకూలించే వరకు సంయమనం పాటించాలన్న నిర్ణయానికి వస్తే జగన్ ఢిల్లీ పెద్దల దగ్గర తలదించి, సర్దుబాటు చేసుకోవాలి. తెగించిన తర్వాత చూసేదే ముందనుకొంటే సురేఖతో పాటు తాను పార్టీ నుంచి బయటకు వెళ్లేందుకు సిద్ధపడాలి. కానీ జగన్‌లో అంత సాహసం కన్పించడం లేదు. సెప్టెంబర్ 2తేది తన భవిష్యత్తు కార్యాచరణ ప్రకటించాలని మొదట చేసిన ఆలోచన కూడా ఇప్పుడు వెనక్కు పోయినట్లు చెప్తున్నారు. డిసెంబర్‌లో శ్రీకృష్ణ కమిటీ నివేదిక వచ్చి, తెలంగాణ సమస్య ఒక కొలిక్కి వచ్చిన తర్వాత కాంగ్రెస్‌లో చాలా పరిణామాలు తటస్థిస్తాయి కాబట్టి, అప్పటి వరకు వేచి వుండాలనే ప్రతిపాదన ఒకటి వుందట. అయితే కొండా సురేఖ ఉదంతంతో వేడెక్కిన వాతావరణం ఆయన్ను అంతవరకు నిలువనిస్తుందా అన్నది ప్రశ్న.

● నెల్లూరు రాజకీయాలలో అసాధ్యుడు

# అంకయ్యగౌడ్ మరణం!



పొదలకూరు మాజీ మండలాధ్యక్షుడు రావుల అంకయ్య గౌడ్ 30తేది కన్నుమూశారు. గత కొంతకాలంగా తీవ్రమైన అనారోగ్య సమస్యలతో బాధపడుతూ ఆస్పత్రులలోనే వుంటున్నారాయన. చక్కెర వ్యాధి ఆయన ప్రాణానికి ముప్పుగా పరిణమించింది. ఆయన వయస్సు 76 సంవత్సరాలు. ఐదుగురు కుమారులున్నారు. మూడేళ్ల క్రితం భార్య మరణించింది.

నెల్లూరు జిల్లా రాజకీయాలలో అంకయ్య గౌడ్ ఒక తిరుగుబాటు శక్తి. అన్న అడుగేస్తే మాస్ అనే సినిమా పాట గుర్తుకు వస్తుంది ఆయన రాజకీయాలను పరిశీలిస్తే. చదువులేదు. పొట్టపొడిస్తే అక్షరం ముక్క రాదు. కానీ వ్యాపారాలలో అనూహిత విజయాలు మూటకట్టుకొన్నాడు. సినిమాలు తీశాడు. కాంట్రాక్టులు చేశాడు. బ్రాందీ షాపులు నడిపాడు. సారాయి సామ్రాజ్యాన్నే నెలకొల్పాడు. దినవారీ లెక్కలు కూడా ఎవరో ఒకరు చదివి వినిపిస్తే తెలుసుకోవాల్సిందే తప్ప, తనుగా చదివే పరిస్థితి లేదు. రాజకీయాలలో అంకయ్యగౌడ్‌ది బహుముఖ వైఖరి. అమాయకుడిగా కన్పడతాడు; అసాధ్యుడుగా ప్రవర్తిస్తాడు. అయ్యా... బాబు అంటూ వినయంగా వుంటాడు. అవసరం వస్తే ఎంతటివాడినైనా ఎదిరించి పోరాటం చేస్తాడు. ఆయన్ను అర్థం చేసుకోవడం ఎట్లనో తెలియక అందరూ తికమకపడేవారు. నేదురుమల్లి జనార్ధనరెడ్డి రెవిన్యూ మంత్రిగా జిల్లాను ఏకఛత్రాధిపత్యంగా ఏలుతున్న సమయంలో ఆయన్ను కొండను పొట్టేలు వలె ఢీ కొన్నాడు. నాసా క్రింద అరెస్ట్ చేసినా లెక్క చేయలేదు. జైలు నుంచి విడుదలై వచ్చినరోజు నెల్లూరు నగరం అంకయ్యగౌడ్ అభిమానుల కోలాహలంతో అల్లాడింది. పొదలకూరు గ్రామాల ప్రజలలో ఆయనకంత పలుకుబడి వుండేది. ఆనం సంజీవరెడ్డి అంతటి వాడిని తన కాళ్ల దగ్గరకు రప్పించు కోగలిగాడంటే గౌడ్ ప్రతిభ ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. ఒక దశలో రాష్ట్రంలోనే పేరున్న బలహీన వర్గాల నేతగా ఎదిగాడు అంకయ్యగౌడ్.

కానీ ఆ తర్వాత వేసిన తప్పటడుగులు ఆయన్ను రాజకీయంగా పతనం చేశాయి. తారాజువ్వ వలె వెలుగులు చిమ్ముతూ నింగికెగిసిన వాడు, అదే తీరులో నేల రాలిపోయాడు. సరైన సలహాలు, సంయమనం పాటించి వుంటే అంకయ్య గౌడ్ రాజకీయంగా ఎంతో ఎత్తుకు ఎదగాల్సినవాడు. ఆయనకు ఐదుగురు కుమారులు అందరిలోకి పెద్ద కొడుకు దశయ్య గౌడ్ అంటే ఎనలేని ప్రేమాభిమానాలు. దశయ్య కూడా తండ్రి పట్ల ఆ రుణానుబంధాన్ని తీర్చుకొన్నాడు. కడపటి దశలో తన కళ్లల్లో పెట్టుకొని చూసుకొన్నాడు. వారి కుటుంబానికి మా సంతాపం తెలియజేస్తున్నాము.

### జానారెడ్డి

మొదటి పేజీ కొరవ

కారణం వల్లనైనా రోశయ్యను తప్పించవలసి వస్తే, కొత్త ముఖ్యమంత్రి తెలంగాణ వాసిగానే ఉంటాదన్నది పరిశీలకుల అభిప్రాయం. ఆ ఖాళీని భర్తీ చేయడానికి అన్ని అర్హతలూ జానారెడ్డికి వున్నాయి. ఒకవేళ తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు జరిగినా కొత్త ముఖ్యమంత్రి కాదగిన అర్హతలు వున్నాయి. ఈ రెండింటిలో ఏది సాధ్యమైనా జానారెడ్డిని అందలం ఎక్కించాలన్నది ప్రయత్నం. ఇప్పటికిప్పుడు నాయకత్వ మార్పిడి, కొత్త రాష్ట్రం ఏర్పాటు లేకపోయినా భవిష్యత్తులో వచ్చే అవకాశాలకు ఇప్పటి నుంచే ఒక మాట వేసి పెడితే తప్పేమీలేదు కదా అనే ఉద్దేశంతో సుకుమార్ తన పలుకుబడి పాచిక విసిరేసి వచ్చినట్లు తెలుస్తున్నది. అహ్మద్ పటేల్ అనుకొంటే కానిదేదీ లేదు కాంగ్రెస్‌లో.

### జనవాణి

2వ పేజీ కొరవ

రంలో త్రవ్వించిన చెరువులు నేటికీ బ్రహ్మాండంగా వుండగా ఉదయగిరిలో మాత్రం ఉపాధి హామీ పేరిట కోట్ల రూపాయల నిధులు స్వాహా చేస్తున్నారు.

వాస్తు రామచంద్ర నెల్లూరు

### సోకు అతగాడిది

మొదటి పేజీ కొరవ

శంలో వున్నారు. తెలంగాణ ఇచ్చినా ఇవ్వకున్నా టిఆర్ఎస్‌కే లాభం కలిగే పరిస్థితి ఏర్పడడం వారిని కలచి వేస్తున్నది. శ్రీకృష్ణ కమిటీ నివేదిక ఏ అభిప్రాయాన్ని తెలిపినప్పటికీ కొంతకాలం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు విషయంలో సాచివేత వైఖరి అవలంబించడమే మంచిదని వీరి ఆలోచన.

సమస్యను మరింత ముదరపెట్టి, 2014 ఎన్నికల ముందు ప్రకటన చేయడం వల్ల కొంత ప్రయోజనం వుంటుందని భావిస్తున్నారు. అయితే కెకె, మధు యాష్కీ వంటి కాంగ్రెస్‌లోని తెలంగాణ వాదులు ఈ అభిప్రాయంతో ఏకీభవించే పరిస్థితి లేదు. ఇప్పుడు తెలంగాణ రాష్ట్ర ప్రకటన చేసి, కొత్త రాష్ట్రంలో కూడా కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తే, 2014 ఎన్నికలలోగా ఉద్యమ ఉడుకుతనం తగ్గి, కాంగ్రెస్ కుదుటపడుతుందన్నది వీరి వాదన.

మొత్తానికి ఉపఎన్నికలలో పోటీ చేయడం ద్వారా రెండు ప్రధాన పార్టీలు తమ గొంతుకు తామే ఉచ్చు పేనుకొన్నాయి.

### రోశయ్యపై గుర్రు

మొదటి పేజీ కొరవ

రాజకీయ ప్రచారం తలకెత్తుకోరు కాబట్టి, తన ఓటమికి రోశయ్య కూడా పరోక్షంగా ప్రయత్నం చేసి వుంటాడని డిఎస్ అనుమానం. ఢిల్లీ పెద్దలకు ఆ కరపత్రాన్ని చూపించి మరీ ముఖ్యమంత్రి మీద ఫిర్యాదు చేశాడాయన. ఈ ఎన్నికలలో గెలిస్తే తనకు పెద్ద పదవి వస్తుందని ప్రచారం చేశానని, దాన్ని చూసి రోశయ్య భయపడి ఈ దుర్మార్గానికి ఒడిగట్టాడని ఢిల్లీ గల్లీలలో గోడు గోడు మంటున్నాడు డిఎస్.

# ఇందిరమ్మ ఇళ్లకు మూడు రంగులు వేయనక్కరలేదు!



పైకప్పున బార్డర్‌గా మూడు రంగులు వేసిన ఇందిరమ్మ ఇల్లు.

జిల్లాలో ఇందిరమ్మ పథకం ద్వారా నిర్మించిన పక్కాగృహాలపై మూడురంగుల గుర్తు నుంచి లబ్దిదారులకు వూరట కలగనుంది. జిల్లాలో మూడు విడతలుగా ఇందిరమ్మ గృహాలు మంజూరయ్యాయి. ఈ గృహాలపై కాంగ్రెస్ పార్టీ జెండాపై నున్న మూడు రంగులు వేయాలన్న నిబంధన వుండేది. ప్రభుత్వమే ఇందుకు సంబంధించిన ఉత్తర్వులను జారీ చేసింది. దీంతో పూర్తయిన గృహాలపై ముందు భాగం, మూడువైపులా మూడురంగుల గుర్తులను దగ్గరుండి వేయించేవారు అధికారులు.

ఇది ఇష్టంలేని కొంతమంది లబ్దిదారులు వ్యతిరేకిస్తే బిల్లులు చెల్లించేందుకు నిరాకరించేవారు అధికారులు. తప్పనిసరి పరిస్థితుల్లో మూడు రంగుల గుర్తును వేయించుకునే వారు. ఇదే పరిస్థితి రాష్ట్రవ్యాప్తంగా అమలు చేయడంతో కొందరు ప్రజాసంఘాల నాయకులు రాష్ట్ర హైకోర్టును ఆశ్రయించి ఇందిరమ్మ పథకం ద్వారా ప్రభుత్వం నిర్మిస్తున్న పక్కాగృహాలపై మూడు రంగుల గుర్తును వేయకుండా ఉత్తర్వులివ్వాలని పిటిషన్లు

## స్పష్టం చేసిన హైకోర్టు

దాఖలు చేయడం జరిగింది. దాదాపు రెండు సంవత్సరాలపాటు హైకోర్టులో పెండింగ్‌లో వున్న ఈ పిటిషన్ ఇటీవల విచారణకు వచ్చింది.

పిటీషన్‌ను సమగ్రంగా పరిశీలించిన న్యాయమూర్తులు పిటీషనర్ల వాదనతో ఏకీభవించి పక్కా గృహాలపై మూడు రంగుల గుర్తులను వేయడం విరుద్ధమని తీర్పునివ్వడం జరిగింది. ప్రభుత్వ నిధులతో పక్కాగృహాలు నిర్మించుకున్నప్పటికి లబ్దిదారునికి ఇష్టమైన రంగులను వేసుకొనే హక్కు వుందని పేర్కొన్నారు. రాష్ట్రంలోని అన్ని జిల్లాల కలెక్టర్లు హైకోర్టు వుత్తర్వులను పాటించాలని ఆదేశించారు. ఇప్పటి వరకు ఇందిరమ్మ గృహాలపై మూడు రంగులు వేసుకున్న వారు వాటిపై ఇష్టమైన రంగుల్ని వేయించుకోవచ్చు.

## రాజకీయ జోక్యం

ఇందిరమ్మ పథకం క్రింద లబ్దిదారులు నిర్మించుకున్న పక్కాగృహాలపై కాంగ్రెస్‌పార్టీ జెండా గుర్తు వుండే విధంగా స్థానిక రాజకీయనాయకులు మూడు రంగుల గుర్తుల్ని మొదటి నుంచి వేస్తున్నారు. రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ అధికారం చేపట్టిన 2005వ సంవత్సరం నుంచి ఇందిరమ్మ పథకం అమల్లోకి వచ్చింది. గతంలో స్థానిక శాసనసభ్యులు ప్రతిపాదనతోనే పక్కాగృహాలు మంజూరయ్యేవి. వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి సిఎం అయిన తర్వాత ఎమ్మెల్యే కోటాను రద్దు చేశారు.

జిల్లాలో దాదాపు రెండు లక్షల పక్కాగృహాలు మూడు విడతల్లో మంజూరు కాబడ్డాయి. గ్రామ పంచాయితీ పరిధిలో స్థానిక కాంగ్రెస్ పార్టీకి చెందిన నేతలు సూచించిన వారికే ఇందిరమ్మ గృహాలు, పెన్షన్లు మంజూరు చేశారు అధికారులు. వీరి రాజకీయ ప్రాధాన్యతను కాపాడుకునేందుకు పూర్తయిన పక్కా గృహాలపై తమ పార్టీ గుర్తులు కనిపించే విధంగా వేయించుకోగలిగారు. రాష్ట్ర హైకోర్టు ఇచ్చిన తీర్పుతో స్థానిక రాజకీయ నేతలు జారీచేసే ఆదేశాలకు బ్రేక్ పడిపోయింది. హైకోర్టు ఆదేశాల గురించి గ్రామీణ ప్రాంత ప్రజలకు వివరించే వారు లేకుండా పోయారు.

మొత్తం మీద రెండు సంవత్సరాల విరామం తర్వాత రాష్ట్ర హైకోర్టు తీర్పు వెలువడడం శుభపరిణామం. అయితే ఈ ఆదేశాలు జిల్లాలోని గృహనిర్మాణశాఖ అధికారులు అమలు చేస్తారా లేదా అని వేచి చూడాలి.

### జిగట కాంభోజరాగం



అయిన వారికి ఆకుల్లోనూ, కాని వారికి కంచాల్లో అనే సామెతలా, ఆనవాయితీ పేరిట అతిథి మర్యాదలకై వెచ్చించే, ఎచ్చి పిచ్చి ఖర్చు, సమయం, కండిషన్లు, సెక్షన్లు, క్లాజులు, బికాజులు సబార్డినేట్ క్లాజులు, రివాజులుగా, అలనాటి బ్యూరో క్రాట్స్ పరిపాలనా యంత్రాంగానికై ప్రిపేరు చేసిన పేపర్లలో, వారికి మాత్రం ఎట్టి రిస్కు రాని విధంగా N.Bలు పెట్టి దేగ కంటికి కూడా కనిపించనంతటి పెద్ద, పెద్ద అక్షరాలతో డ్రాఫ్టింగ్ చేయబడిన డాకుమెంట్లను పలు ఫైళ్లలో పెట్టి ఎర్రటి పట్టీతో కట్టి మూసి,(**ఆ పట్టీనే రెడ్‌టేప్** అంటారు) మరెన్నెన్నో 'ఫార్మాలిటీస్‌'కై ఆఫైళ్ళు, పలు రైళ్లలో మైళ్లకు మైళ్లు వెళ్లి, మళ్లీ తిరిగి రావడానికి ఐదేళ్లు పట్టినా అబ్బురపడనక్కర్లేదు. అప్పటికి ప్రగతి పథకాల అంచనా **10** కోట్లనుకుంటే **100**కు చేరుతుంది. కేవలం ప్రజలకు సంబంధించిన పనులు కూడా జాప్యమవడం చేత, వారికి కలిగే చీకు, చింత, చీకాకు, చిరాకులనబడే శాడిజాన్నే **'రెడ్‌టేపిజమ్'** అంటారు. కనుక పాత టేపులోని పాత పాటలను **50%**కు కుదించి, 'ఆలస్యం అమృతంగాదు, విషం' అనేలా 'రీ డ్రాఫ్టింగ్' చేయకపోతే కార్యాలయాల్లో పనులు పేరుకు తగినట్టే ఫైళ్లతో పేరుకుపోతాయ్. i.e – కార్య+లయం = కార్యాలయం VIZ 'కార్య'మనగా = పని, క్రియ, కర్మణ్యం. 'లయం' అంటే విశ్రాంతి, మందగతి, మాయం, నక్కిదాంకోవడం, సోమరితనం. ఉదాహరణకు – ఏ కార్యాలయంలోనో పనిబడితే ఈ **Red tapisom** వలన ఆ పని సం॥లు పడ్తుంది. Red notes తీసుకునే ఆఫీసుల్లోనయితే, అంకెను బట్టి ఆరడుగుల టేప్‌కాస్తా, అర నిముషంలో అరంగుళమై అరగంటలో పనైపోతుంది. (ఏ తాలుకు చిన్నపనైనా! అది చిన్న తాలూకాఫీసైనా.) ఈ చిత్రం – భళారే విచిత్రం. ఇక రెడ్ టేపిజం గూర్చిన వచనాలు నావి గావు; అవి పదకోశ నిర్వచనాలు.

**C̄ Patriasim to rule out Red tapiam**



# ప్రభుత్వ పాఠశాలల్లో పుస్తకాలు లేకుండానే చదువుకోవాలా?

విద్యాశాఖ అధికారుల నిర్లక్ష్యం కారణంగా ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులకు ఇంకా పూర్తిస్థాయిలో పాఠ్యపుస్తకాలు అందని పరిస్థితి నెలకొంది. జిల్లాపరిషత్, ప్రభుత్వ, మునిసిపల్ పాఠశాలల్లో చదివే పిల్లలకు ఒకటవ తరగతి నుంచి 10వ తరగతి వరకు అందరికి పాఠ్యపుస్తకాలను అందచేయాల్సిన ప్రభుత్వం తగిన చర్యలు చేపట్టకపోవడంతో స్కూళ్లు తెరచి మూడునెలలు కావస్తున్నా ఇంతవరకు బాధ్యత ఎంఇఓలు తీసుకోవాల్సి వున్నా వివిధ మండలాలల్లో మండల విద్యాధికారుల పోస్టులు ఖాళీగా వుండడం, హెడ్‌మాస్టర్లు ఇన్‌ఛార్జి ఎంఇఓలుగా కొనసాగుతుండడంతో ఆ ప్రభావం పాఠశాలల విద్యార్థులపై పడుతోందనడానికి పుస్తకాల సరఫరా ఉదాహరణ.

జిల్లాకు ఇంకా 2,86,393పైగా పుస్తకాలు రావాల్సి వుంది. ఇక్కడ అధికారుల మధ్య సమన్వయం లేకపోవడం, జిల్లా విద్యాశాఖధికారి తనకేమి సంబంధం

**2010 - 11 విద్యా సంవత్సరానికి సంబంధించి జిల్లాకు మొత్తం 16,30,619 పాఠ్యపుస్తకాలు అవసరం కాగా 13,44,225 పుస్తకాలు మాత్రమే బడులు తెరిచే సమయానికి వచ్చాయి. ఇంకా 2,86,393 పుస్తకాలు అవసరం కాగా అవి ఎప్పటికి వస్తాయో అని తెలియని పరిస్థితి. దీని మూలంగా ప్రభుత్వ పాఠశాలల్లో పుస్తకాలు లేకుండానే చదువు చెప్పేస్తున్నారు.**

లేనట్లు వ్యవహరిస్తుండడంతో పుస్తకాల సరఫరా బాధ్యత డిపో మేనేజర్, డిప్యూటి డిఇఓలు చూసినా పుస్తకాలు విద్యార్థులకు అందేలా చూడాల్సిన బాధ్యత డిఇఓదే. ఆయన కేవలం ఎంఇఓలు, హెడ్‌మాస్టర్లతో సమావేశాలు ఏర్పాటుచేసి ఇంకా ఎన్ని పుస్తకాలు రావాలి, ఏఏ పుస్తకాలు రావాలో వివరాలు తీసుకొని సరిపెట్టుకొంటుండడంతో విద్యార్థులు పుస్తకాలు అందక అవస్థలు పడుతున్నారు.

అన్ని పుస్తకాలు అందరికి అందిన దాఖలాలు లేవు. 2010–11 విద్యా సంవత్సరానికి సంబంధించి జిల్లాకు మొత్తం 16,30,619 పాఠ్యపుస్తకాలు అవసరం కాగా 13,44,225 పుస్తకాలు మాత్రమే బడులు తెరచే సమయానికి జిల్లా కేంద్రానికి చేరుకున్నాయి. వీటిని స్టాక్ పాయింట్ నుంచి ఆయా మండల కేంద్రాలకు పుస్తకాలను చేరవేసే బాధ్యత మండల విద్యాశాఖాధికారులది. మండలాల్లోని అన్ని పాఠశాలలకు పుస్తకాలను చేరవేసే

డిపోలో పుస్తకాల నిల్వలను పరిశీలించినట్లయితే ఆసక్తికర విషయాలు బయటపడుతున్నాయి. ఆయా పాఠశాలలకు అవసరమైన పుస్తకాలను సరఫరా చేయాల్సి వుండగా చేతికి అందిన వాటిని వాహనాల్లో వేసి పంపుతుండడంతో పలుచోట్ల ఒక సబ్జెక్టు పుస్తకాలు ఎక్కువగా, ఇతర పుస్తకాలు అసలు అందకుండా వున్నాయి. దీనికి తోడు పదవతరగతి పుస్తకాలు కొంతమేర వున్నా వీటిని పంపిణీ చేయడంలో అలసత్వం కారణంగా అవీ అందని పరిస్థితి నెలకొంది. దీని కంతటికి కారణం అధికారుల నిర్లక్ష్యం, సిబ్బంది సమన్వయలోపమే కారణమని పలువురు ఉపాధ్యాయులు వ్యాఖ్యానిస్తున్నారు.

ఇటీవల జరిగిన జిల్లాపరిషత్ స్టాండింగ్ కమిటి సమావేశంలోనూ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి పాఠ్య పుస్తకాలు ఇంకా వివిధ పాఠశాలలకు పూర్తిస్థాయిలో అందకపోవడంపై విద్యాశాఖ అధికారులను నిలదీయగా వారు నీళ్లు నమలడంతో తీవ్రంగా హెచ్చరించారు. పలు విద్యార్థి సంఘాలు ఈ సమస్యను జిల్లా కలెక్టర్ దృష్టికి తీసుకొని పోయాయి. ఇప్పటికైనా విద్యార్థుల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని విద్యాశాఖ అధికారులు కుంభకర్ణ నిద్ర వదలి పుస్తకాలు అందరికి అందేలా చర్యలు చేపట్టాలని పలువురు కోరుకొంటున్నారు.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.